# ఈ నెలలో విడుదల!



వాహినీ వారి

# మల్లీశ్వరి

భానుమతి · యన్. టీ. రామారావు నటించినది

స్టూడియో వాహినీ

నిర్మాత-దర్శకుడు: బి. యన్. రెడ్డి



# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, పాటలు,

ఇంకా, ఇంకా ఎన్నో వున్నై.


**చందమామ ఆఫీసు**

పోస్టుబాక్సు నెంబరు ౧౬౮౬

మద్రాసు.1.



ఆరోగ్యానికి, రుచికరానికి



పూజలకు, వివాహాలకు




గడియారం మార్కు

కర్పూరము

ఉపయోగించండి

గోపాల్జీ చాంపశీ & కో.
నెం. గోవిందప్ప నాయక్ వీధి, మద్రాస్

# మధుర మూరులకు మధురాలు



మార్టన్స్ మిఠాయిలకన్న వారికి ఇవ్వ
తగిన మంచివస్తువు మరొకటి లేదు.




**MORTON**

## పిల్లలకు తప్పనిసరి

## అందరకూ అనివార్యము

సి. అండ్ ఇ. మార్టన్ (ఇండియా) లిమిటెడ్

## ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెని, లిమిటెడ్

(హెడ్డాఫీస్: మచిలీపట్నం)

భీమా వ్యాపారములో 25 సం॥లు జయప్రదము

గాను — సామర్థ్యముతోను సేవచేసిన సంస్థ.

| | |
|---|---|
| 1950 లో నూతన వ్యాపారము .... .... | రు. 2 కోట్లు |
| అమలులోనున్న మొత్తము .... .... | రు. 9 కోట్లు |
| మొత్తము భీమా నిధులు .... .... | రు. 2 కోట్లు పైగా |
| సంవత్సరాదాయము .... .... | రు. 45 లక్షల పైగా |

జీవిత భీమాతోబాటు అగ్ని, మోటారు, ప్రమాద, నౌకా వ్యాపారముచేయును.

శాఖా ఆఫీసులు:

మదరాసు, బొంబాయి, కలకత్తా, నాగపూరు, ఢిల్లీ, బెంగుళూరు, బెల్గాం, అనంతపూర్, సికింద్రాబాదు, కోయంబత్తూరు, బర్హంపూర్, ఎర్నాకులం, బెజవాడ, గుంటూరు, జెంషెడ్పూర్, విశాఖపట్టణము, రాజమండ్రి. మంగళూరు, డిబ్రూగర్ (అస్సాం) పాట్నా, అల్లాహాబాద్





# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియిచ్చును. పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4


## చందమామ

## చందాదారులకు మనవి

చందమామ ప్రతినెల, గతనెలాఖరులోనే చందాదారులకు పోస్టు చేయబడును. కాపీ చేరనిఎడల మొదటి ఆరుతారీఖుల లోగా తమ పోస్టాఫీసులో విచారించి, మాకు తెలియజేయాలి. 10 వ తారీఖు తరువాత వచ్చు కంప్లైంట్లు ఆమోదింపబడవు. గడచినమాసములలో చేరలేదనే కంప్లైంట్లు గమనింపబడవు.

# కొందరు తల్లులకు ఇది తెలియదు!

అవును, హాయిగా లేనప్పుడు, పైగుడ్డ ఒరపిడిని కల్గించినప్పుడు, ఎవరైనా ఏడుపక ఏంచేస్తారు? మా అమ్మనలే మీ అమ్మ కూడా నీళ్లు పోసిన తరువాత, గుడ్డలను మార్చినప్పుడు, నీకు జాన్సన్స్ బేబీ పౌడరును ఎందుకు రాయదు? ప్రపంచంలోకెల్ల అతి మృదువైన చర్మముల కొరకు అది తయారు చేయబడినది.... దానిని వాడితే నీకు చాల హాయిగా ఉంటుంది.

నీకు మాట్లాడుట చేతనయితే ... మీ అమ్మకు దీనిని చెప్పే వాడివి.



అమ్మా!




మీ బిడ్డ ఏడ్చాడంటే అతనికి హాయిగా లేదన్న మాట. జాన్సన్స్ బేబీ పౌడరును రాయండి. అది యింద్రజాలంవలె పని చేస్తుంది! జాన్సన్స్ బేబీ పౌడరులోగల ప్రత్యేక దినుసులు మృదువైన చర్మములకు సరిపడి వాటికి శాంతి నిచ్చును. అందువల్లనే చాలమంది తల్లులు (మరియు తండ్రులూ!) తమకు కూడ దీనిని వాడుతున్నారు. నేడే ఒక టిన్నును కొనుడు—పాపాయికీ, మీకూ!

పాపాయికి అత్యుత్తమము — మీకూ అత్యుత్తమము

**Johnson's BABY POWDER**

Regd. Trade Mark

జాన్సన్స్ బేబీ పౌడరు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు ఐ. సి. ఐ. (ఇండియా) లిమిటెడ్

[illegible] జాన్సన్స్ "ప్రిక్లీ హీట్ పౌడరు"తో చురచుర మనిపించు వేడిని తొలగించవచ్చును.

# హెల్త్ సీళ్లు కొనండి



ప్రతి జాతికీ ఆరోగ్యం అతిముఖ్యమైంది. తక్కిన అనేక విషయాలలోవలెనే మన దేశంలో ఆరోగ్యవిషయకమైన సేవ చాలినంతగా లేకున్నది. ఈ సేవను త్వరలో అభివృద్ధి చేయాలి. ఐతే ఆర్థికలోపంవల్ల అది అసాధ్యమనిపిస్తున్నది.

కాబట్టి ప్రజలూ ప్రభుత్వమూకూడ సహకరించి, ఈ లోపాన్ని భర్తీచేయాలి. అనేక దేశాలలో ఆరోగ్యాభివృద్ధికి సంబంధించిన కార్యకలాపాలలో హెల్తు సీళ్లూ, హెల్తు స్టాంపులూ ఆయా ప్రభుత్వాలకు సాయపడుతున్నాయి. అలాగే మన ఇండియా ప్రభుత్వపు ఆరోగ్యశాఖా మంత్రివర్గము ఈ 2 అక్టోబరు 1951 నుండి హెల్త్ సీళ్లు విక్రయించే ఉద్యమాన్ని ప్రారంభించటానికి నిశ్చయించారు. ఈ సీళ్లు ఒక రూపాయి, నాలుగణాలు, ఒక్క అణా విలువలకు పోస్టాఫీసులన్నిటిలోనూ విక్రయింపబడుతున్నయ్.

ఈ ఉద్యమాన్ని ప్రోత్సహించటం ద్వారా వ్యాధిగ్రస్తులకు బాధానివృత్తి కలిగించమని ప్రతివారినీ నేను కోరుతున్నాను. ఒక మంచి ఉద్యమానికి తమంతట తాము తోడుపడటం ఎల్లప్పుడూ యోగ్యమైన పని. పూర్తి సహకారం లభిస్తుందని నమ్ముతున్నాను.

అమృత్ కౌర్,

ఆరోగ్యశాఖా మంత్రి,

ఇండియా గవర్నమెంట్.

---

న్యూ ఢిల్లీ-ఇండియా ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రివర్గము వారిచే ప్రచురింపబడినది.
యం. ఎ. పి. ఇన్‌డస్ట్రీస్ (మద్రాసు) వారి సౌహార్ద్రతతో ప్రకటింపబడినది.

నవంబరు 14వ తేదీ విడుదల

# ఆడజన్మ

మాడర్న్ థియేటర్స్ తయారు

డైరెక్షన్
జి.ఆర్. రావ్

పూర్ణా రిలీస్...

# స్టార్ ఆఫ్ ఇండియా

పెన్సిళ్లకై

## ది మద్రాస్ పెన్సిల్ ఫాక్టరీ వారిని

★

ఉత్తమ తరగతి అచ్చుపనులకు, లితోప్రింటింగునకు

## హో అండ్ కంపెనీ

వారిని

★

అన్ని రకములైన స్టేషనరీ పరికరములకు

## వి. పెరుమాళ్‌చెట్టి అండ్ సన్స్

వారిని

సంప్రతించండి.

---

**వి. పెరుమాళ్‌చెట్టి అండ్ సన్స్,**

3, స్ట్రింగర్ వీధి :: మద్రాసు - 1



# చందమామ

సంచాలకుడు : చక్రపాణి

డిశెంబరు నెల వచ్చిందీ అంటే అందరూ కొత్త క్యాలెండర్లు సంపాదించటం మామూలు. కొత్త క్యాలెండరు దొరకటంతోనే పాత క్యాలెండరు పారవేయటంకూడా పరిపాటే. ఐతే - అలా పారవేసేముందు ఒక నియమాన్ని పాటించాలి. అది యేమిటీ అంటే—జనవరినుండి డిశెంబరువరకు గల ఈ పన్నెండుమాసాల కాలపరిమితిని జీవితంలో ఒక మైలురాయిగా ఎంచుకోవాలి. ఒక్కసారి వెనుకకు తిరిగి—'ఈ యేడాదిలోనూ నా జీవితమెట్లా గడిచింది? అనుకూలంగా, సాగిపోయిందా? ఒడుదుడుకులతో కూడివున్నదా? జీవితరథం సాగిపోవటానికి అవసరమైన జ్ఞానం, ధనం, కీర్తి ఎంతవరకూ ఆర్జించాను? ఈ గడువులో నేను నెరవేర్చగలిగిన పనులేమిటి? అనుకొన్నవాటిలో పూర్తిగాక నిలిచిపోయిన వేమిటి?'—ఇటువంటి ప్రశ్నలను వేసికొని వాటికి సరియైన సమాధానాలు చెప్పుకోవాలి. అప్పుడే మనం ఏ పరిస్థితిలో ఉన్నామో తెలుస్తుంది. తెలిసినప్పుడే ముందుకథనుగూర్చి ఒక నిశ్చితానికి రాగలుగుతాం. ఆ నిశ్చయాన్నిబట్టి రాబోయే వత్సరం మన మేలుకు, అభివృద్ధికి తోడుపడుతుంది. కనుక ఏటా ఈవిధంగా మన స్థితి పరిశీలించుకోవాలి.

సంపుటి 9 :: డిశంబర్ '51 :: సంచిక 6






# కలవారి అబ్బాయి

కలవారి అబ్బాయి రాముడనువాడు
పండుగకు క్రొత్తఉడుపులు తొడిగినాడు.
తళతళమెరిసేటి పట్టుచొక్కాయి
పట్టులాగూ చూచి మురిసెనబ్బాయి.

'సరిక్రొత్త చొక్కాయి తొడగిననాడు
ఇంటిలో కూర్చుంటె ఎవడుచూస్తాడు'
అని మనసులో రాము డూహించినాడు.
'ఆడుకొంటానమ్మ! బయట' నన్నాడు.

అమ్మ అన్నది 'బయటికెళ్ళకబ్బాయి
క్రొత్తబట్టలు నీవి, మాసిపోతాయి.
బయటికెళ్ళావంటె జాగ్రత్త! నీవు
బూచులుంటవి, ఇంక తిరిగిరానీవు.'

కాని ఆ అబ్బాయి మాట వింటాడా?
అందులోనూ క్రొత్తబట్టలేశాడా!
తుదకు మనసును పట్టలేకపొయ్యాడు
గుట్టుచప్పుడుగాను బయటకెళ్ళాడు.

బయట ఒక కుర్రాడు ఎదురువచ్చాడు
వెర్రిబాగులవాడు, కడుపేదవాడు.
చింకిబట్టలవాడు, జిబ్బితలవాడు
ఒంటిపై దళసరిగ దుమ్మున్నవాడు.

రచన:
"బైరాగి"

రాము డతనిని ఏవగించుకున్నాడు
చీదరించుక త్రోవ తొలగిపొయ్యాడు.
కాని కాలొక అరటితొక్కపై వేసి
పడి, చూడసాగాడు ఆకసంకేసి.

తల చెరగిపోయి, వలువలు మాసిపోయి,
మురుగుకాలవనీట మరకలైపోయి
కలవారి అబ్బాయి బావురన్నాడు.
పేదపిల్ల డతణ్ని లేవదీశాడు.

చేయూతఇచ్చాడు, దుమ్ముదులిపాడు
ప్రేమతో తల నిమిరి బుజ్జగించాడు
'భయపడకు, పాపమ'ని ఊరడించాడు.
ఇంటివరకూ తాను సాగనంపాడు.

రాముడింటికివచ్చి భోరుమన్నాడు
జరిగింది తల్లితో చెప్పివేశాడు.
అతడు దాచక నిజంచెప్పటంవల్ల,
పల్లెత్తు మాటైన అనలేదు తల్లి.

రాముడారాత్రి ఒక కలగాంచినాడు
మరల ఎదురయ్యాడు పేదపిల్లాడు.
కాని అతనినిచూచి రాముడీసారి
ఏవగించుక తొలగిపోలేదు దారి.








ఆరేళ్లయినా నిండని పసిబాలుడు. ఆ బాలుణ్ణి తల్లి తొలిసారిగా షికారుకు తీసుక వెళ్లింది. ఆ పిల్లవాడు అసలు కన్నుతెరిచి ప్రపంచం చూడటం అదే మొదలు.

వారిద్దరూ అలా వెళుతూవుండగా దారిలో ఒక బిచ్చగాడు కంటబడ్డాడు. బిచ్చగాడిని చూడటంకూడ ఆ కుర్రవానికి అదే మొదలు. చింపిపాతలు చుట్టబెట్టుకుని, ఎందుకువచ్చిన బతుకురా దేవుడా అని కళ్లలో ప్రాణాలుపెట్టుకుని రోజులు నెట్టుకుపోతూవుండే ఆ ముసలివాని దీనవదనం చూచీ చూడటంతోనే బాలుని హృదయం కరిగిపోయింది. తల్లి చంకనుండి గభీమని దిగాడు. ఆ బిచ్చగానిని కౌగిలించుకొన్నాడు. ప్రేమతో నిమిరాడు. అంతేకాదు; ఆవేదనతో "అమ్మా! చూస్తే జాలివేయటంలేదా? పాపం!—వీనికేమైనా ఇయ్యవే!!"—అని ఎలుగెత్తి బతిమలాడాడు.

పసిపాపని ఆవేదన గమనించిన ఆ వృద్ధునికి అప్రయత్నంగా బాష్పాలు రాలినై. పిల్లవాని తల్లివేపు తిరిగాడు వాడు: "అమ్మా!—ఈ బిడ్డడు సామాన్యుడుకాడు. 'పువ్వు పుట్టగానే పరిమళిస్తుం'దన్నట్టు ఇతడు తన ప్రజనూ తనదేశాన్నీ గాఢంగా ప్రేమించే ఘనుడవుతాడని ఇప్పుడే తెలుస్తున్నది. ఈ మహానుభావుణ్ణి జాగర్తగా పెంచుతల్లీ!" అంటూ పిల్లవానిని దీవించిపోయాడు.

ఆ బిచ్చగాని దీవన ఫలితంగా నవనీత హృదయుడైన ఆ బాలుడు పెరిగి పెద్దవాడై తన ప్రజలకోసం, కాయకష్టపడే కార్మికుల సౌఖ్యంకోసం, కోరి అష్టకష్టాలు పడ్డాడు. నైతికంగా తన దేశాన్ని ఎన్నోవిధాల ఉద్ధరించి అద్భుతచరితుడయ్యాడు. ఏ మహానుభావుడు తన అవసానదశలోకూడ 'నాగుండె చీల్చిచూడండి. దానిపైన 'ఇ-ట-లీ' అనే మూడక్షరాలు లిఖితమై ఉంటాయి' అని చెప్పాడో, ఆ అకుంఠిత దేశభక్తుడే అలనాటి ఆరేళ్లబాలుడు—ప్రపంచానికి మార్గదర్శకుడైన జోసెఫ్ మజినీ.

# తోటకూర వృక్షం

పూర్వం శంభుదాసూ, దండపాణీ అనే ఇద్దరు అన్నదమ్ములు ఉండేవారు. శంభుదాసు తనవాటాకు వచ్చిన నాలుగు ఎకరాల భూమీ వ్యవసాయం చేసుకు జీవించేవాడు. దండపాణి తన నాలుగు ఎకరాలూ అమ్మేసి ఆ సొమ్ముతో వర్తకం పెట్టి చూస్తూండగానే లక్షాధికారి అయాడు. వర్తకంలోలాగ వ్యవసాయంలో గభీమని దశ ఎత్తుకోటానికి అవకాశం ఉండదు కదా! అందుచేత, శంభుదాసు ఎదుగూ బొదుగూ లేకుండా అలాగే ఉండిపోయాడు.

ఒకయేడు శంభుదాసు తన నాలుగు ఎకరాల పొలంలోనూ ఒక కుంచెడుమేర దున్ని కలుపుతీసి బుట్టెడు తోటకూర విత్తులు తెచ్చి జల్లేడు. చక్కటి వర్షం కురిసింది. విత్తులన్నీ మొలకలెత్తినై. కొద్దిరోజులలోనే పెరడంతా పెళ్లికూతురు ముఖంలాగ కలకలలాడుతూ కనపడింది. రోజూ మోపెడు మొక్కలు పట్టుకుపోయి అమ్ముకొచ్చి ఆ సొమ్ముతో అతడు పొట్టబోసుకునేవాడు.

"ఊళ్లో నీతమ్ముడు మహదైశ్వర్యంతో తులతూగుతూ ఉంటే, నీవిలాగ కష్టపడడమేమిటి' అని ఎవరైనా అంటే? "ఎవరి అదృష్టం వాళ్లది. వాడి అదృష్టం బాగుండి ఏదో ఇంత సంపాదించుకున్నాడు అని నేను సంతోషించవలసిందేగాని, వాటాకు వెళ్లకూడదు" అని సమాధానం చెప్పి, తనకు ఉన్నదానితో తృప్తిపడేవాడేగాని తమ్ముణ్ణిచూసి ఎంతమాత్రమూ అసూయ చెందేవాడుకాదు.

పొలంలో పెరిగిన తోటకూర మొక్కలన్నిట్లోకి ఒక మొక్క చాలా జబరుగా పెరిగి, చూడటానికి ఎంతో ముచ్చటగా కనపడింది. దాన్ని పీకటానికి మనసొప్పక వదిలేసేసరికి, అది ఒక పోకమొక్కంత

బి. అవివేలు - నల్లగొండ



ఎత్తున ఎదిగింది. ఆదారిని వచ్చిపోయే రైతులంతా దాన్నిచూసి ఆశ్చర్యపోయి, 'తోటకూరమళ్లు మేమూ చిన్నప్పట్నుంచీ వేస్తున్నాంకాని, ఎప్పుడూ ఏమొక్కా ఇంత ఎత్తున ఏపుగా వృక్షంలాగ ఎదగటం ఎరగ!' మన్నారు. ఆ మొక్కను అందరూ తలకొకవిధంగానూ మెచ్చుకుంటూవుండే సరికి అతడు దాన్ని అన్ని మొక్కలకు మల్లేనూ కానీకో అర్ధణాకో అమ్మివేయ కూడదని నిశ్చయించుకున్నాడు.

ఇంతకీ అది లావుగా పెరిగి, ముదిరి పోయింది గనక పులుసులో వేసుకున్నా, కూరవండుకున్నా అంత రుచిగా వుండదు కూడాను. కనుక దాన్ని ప్రదర్శనానికే ఉంచెయ్యాలి అని నిర్ధారణచేసుకున్నాడు.

మరికొన్నాళ్లకి ఆ దేశం ఏలే రాజుగారు తన పరివారంతో ఆ దారిన వచ్చి ఆ తోట కూర వృక్షాన్ని చూసి 'తోటకూరమొక్క యేమిటి, ఇంత బారీగా పెరగడమేమిటి!' అని ఆశ్చర్యపడి దానిమీద మోజుపడ్డారు.

అప్పుడు శంభుదాసు 'ప్రభూ, ఈ మొక్క నా పెరట్లో ఉంటేయేంగాను? ఉద్యాన వనంలో నాటించవలసిన ఒకటవజాతి మొక్క!' అన్నాడు. రాజుగారికి బ్రహ్మానందమైంది. శంభుదాసు ఆ చెట్టును చుట్టూ ఒక అడుగు కైవారంగల బెల్లుతో సహా పెల్లగించి, రాజుగారి ప్రక్కనే రథం పైన ఉంచి, వారి ఆజ్ఞానుసారం తాను కూడా ఆయనతో ఉద్యానవనానికి వెళ్లి అక్కడ దాన్ని స్వయంగా పాతి చక్కా వచ్చాడు.

వచ్చేటప్పుడు రాజుగారతనికి పెద్ద వరహాలమూట ఒకటి బహుమతి ఇచ్చి సత్కరించి పంపించారు.

తలవని తలంపుగా వచ్చిన ఆ సొమ్ముతో దరిద్రమంతా తీరిపోవటమే కాకుండా శంభుదాసు ఒక్కసారిగా ఐశ్వర్యవంతు



డయాడు. ఒక్క తోటకూర చెట్టుతో అతడు ఈవిధంగా అఖండమైన ఐశ్వర్యం సంపాదించాడనేసరికి గ్రామస్థులందరికీ అతని పైన అసూయ పుట్టుకొచ్చింది.

తక్కిన వాళ్లమాటకేం, అతని తమ్ముడికే బాధ కలిగింది. అన్నకు పట్టిన ఉచ్చదశకు సంతోషించటానికి బదులు అతడు విచారించసాగాడు.

"అతడికీ మంచిరోజులు వచ్చాయి. నాకుమల్లే నా అన్నకూడా సుఖపడతాడు" అని అనుకోవటం మానేసి, తన సొమ్మేదో అతగాడు తినేస్తున్నట్లుగా పరిపరివిధాల పరితపించాడు దండపాణి. ఏమైనా 'నేను కూడా రాజువద్దకు పోయి అన్నకంటే ఎక్కువగా సొమ్ము సంపాదించుకు వస్తేగాని నిద్రపోకూడదు' అని తోచింది. ఐతే, మరి రాజుగారికి ఎటువంటి కానుక పట్టుకువెళ్లితే బాగావుంటుందీ? అని తీవ్రంగా యోచించాడు.

'ఒక్క తోటకూర మొక్కకే అంత ఐశ్వర్యం ఇచ్చాడే! విలువైన కానుక ఏదైనా పట్టుకెళ్లి సమర్పిస్తే అధమం అన్నకిచ్చినదానికి నూరురెట్లయినా ఇవ్వడా?' అనుకొని దండపాణి తన ఆస్తి అంతటితో బంగారం కొని, పెద్ద డాలు ఒకటి తయారు చేయించాడు. నవరత్నాలూ ఆ డాలుకు పొదిగింపించాడు. తయారైన ఆ డాలును జోడుగుఱ్ఱాల సారటులో ఎక్కించుకొని కోటకుపోయి రాజుగారికి దానిని కానుకగా సమర్పించాడు.

ఆ డాలును చూసేసరికి రాజు బ్రహ్మానందభరితుడై మంత్రితో "సచివోత్తమా, ఇంత విలువైన కాన్కను తెచ్చిన ఇతగాడికి మనం బదులుగా ఏదైనా ఒక గొప్ప బహుమానం చెయ్యాలయ్యా. ఏమి బహుమానం ఇస్తే బాగుంటుందో బాగా ఆలోచించు" అన్నాడు.



అందుకు మంత్రి 'ప్రభూ, ఆలోచన కేముంది? ఏనుగులు, లొట్టిపిట్టలు, గుఱ్ఱాలు—ఇలాంటివేమైనా ఇవ్వొచ్చు. వాటిపైన వరహాలమూటలు వేసి మరీ ఇవ్వవచ్చు' అన్నాడు. రాజుగారికి ఆ ఆలోచన తృప్తికరంగా తోచలేదు.

"ఇంత విలువైన డాలును బహుమతిగా ఇవ్వగలిగిన ఇతడు ఎంతో ఐశ్వర్యవంతుడై యుండాలి. ఇతడికి నేను మళ్లీ వరహాల మూటలివ్వటంలో గొప్ప యేముంది? జిలేబీలతో మొహంమొత్తి ఉన్నవాడికి మరో నాలుగు జిలేబీలు వడ్డించటంలాగానే వుంటుంది ఇది. కనుక అపూర్వమైన వస్తువేదైనా ఇవ్వాలి" అన్నాడు రాజు.

ఏమీ నిర్ధారణ కాక ఆనాటికి సభ చాలించి రాత్రి మళ్లీ ఆలోచనలో పడ్డాడు.

మరునాడు రాజుగారు ఉద్యానవనంలో పచారు చేస్తూండేసరికి, అక్కడ వెన్నెట్లో శంభుదాసు పాతివెళ్లిన తోటకూరవృక్షం నదరుగా కంటపడింది. దాన్ని చూడ్డంతోనే రాజుకి ఇంతకన్న అపూర్వమైన వస్తువు ఉండబోదని తోచింది. నవరత్నఖచితమైన బంగారు డాలు బహుమానం తెచ్చిన దండపాణికి ఇది ఒక్కటే తగిన బహుమతిగా తలచాడు.

ఆ చెట్టును బెల్లు తోసహా జాగ్రత్తగా తవ్వించి, ఆయన బసకు పంపించాడు. ఏనుగులపైనా, లొట్టిపిట్టలపైనా వరహాల సంచులు వస్తాయని ఎదురుచూస్తూవున్న దండపాణికి ఆ తోటకూర స్తంభం ప్రత్యక్షమయేసరికి గుండె నీరైపోయింది! ఆ తోటకూరవృక్షం ఎదటికి పోయి నుంచుని—

"నా ఐశ్వర్యమంతా హరించిన ఓ స్తంభమా! నిన్ను నేనేం చేసుకోను? చేవగల మరో మొక్క ఐతే ఎండబెట్టి పొయ్యిలోనైనా పెట్టుకోవచ్చు! అందుకైనా ఉపయోగించవు కదా నీవు!" అంటూ కంటికీ మింటికీ ఏకధారగా ఏడవసాగాడు.






## 18

క్రొద్దిసేపటికే పొగ మాయమైంది. మళ్లీ అడుగు ముందుకు వేసేసరికల్లా రకరకాల శబ్దాలతో గుహంతా మారు మ్రోగింది. ఐనా ఉదయనుడు చలించ లేదు. దేవికి ఎదురుగా నిలిచాడు. 'ఇందరు అమాయకుల ప్రాణాలను బలి కోరటం నీకు న్యాయమేనా తల్లీ! ఆ దుర్మార్గుడికి మరింతబలం ప్రసాదించటంలో లోకానికి మేలేమిటి తల్లీ?" అన్నాడు.

దేవి ఉలకలేదు; పలకలేదు.

"ఇంతవరకూ నిద్రాహారాలు లేక పడ రాని కష్టాలు పడ్డాను. ప్రాణాలు పోయినా సరే, వాడిని హతమార్చనిదే పోను. వాడి ప్రాణాలెక్కడున్నాయో చెప్పి పుణ్యం కట్టుకో!" అన్నాడు మళ్లీ ఉదయనుడు.

దీనికి సమాధానం చెప్పలేదు దేవి.

ఇది పనిగాదని ఉదయనుడు దేవి చేతిలో వున్న గెద్దని తన కత్తితో ఒక్క వ్రేటుకి నరికివేశాడు. గెద్ద కాస్తా అగ్ని గుండంలో పడింది. అలా పడిందో లేదో దేవి విగ్రహం ఒక్కసారిగా మాయమై ఆ ప్రదేశమంతా బ్రహ్మాండమైన వెలుగుతో నిండిపోయింది.

ఉదయనుడు గిరుక్కున వెనుదిరిగి చూచాడు. అంతకుముందు తను దాటి వచ్చిన ద్వారాలూ, గదులూ ఏవీలేవు. అంతా ఒక ఎడారిలా తయారైంది.

ఉదయనుడు తిరుగుముఖం పట్టాడు. అంతకుముందు రత్నాల ద్వారం వున్న చోట రత్నాలతో పొదగబడిన ఒక బాతు గుడ్డువంటి గుడ్డు కనుపించింది. దానిని తీసుకుని మరికొంతదూరం వచ్చేసరికి



అలాంటిదే వెండిగడ్డు కనుపించింది. అదీ తీసుకుని మరి కొంతదూరం వెళ్లేసరికి బంగారు గడ్డు కనుపించింది. దానినీ తీసుకుని ముందుకు సాగేసరికి, గెడ్డపువాడు వేలాడతీయబడిన గడకూడా కనుపించకుండాపోయింది.

ఉదయనుడు విస్తుపోతూ పాతాళం లోంచి బైటికివచ్చాడు. అప్పుడే రాక్షసుడి సేవకులువచ్చి చుట్టుముట్టారు. వాళ్లతో పాటు కొలనులో హంసరూపంలో ఉంటున్న వాళ్లుకూడా మామూలు స్వరూపాలుపొంది వచ్చేశారు. సోదరుడు కనపడగానే సంధ్య ఒక్క పరుగున వచ్చి కౌగిలించుకున్నాడు.

ఇంతలో రాక్షసుడి సేవకులు ఉదయనుడిని అమాంతం భుజాలపైకి ఎక్కించుకుని "నీవు దేవుడవే, మారాజా! నీ ధర్మమా అని, ఇన్నాళ్లకు మాకు ముక్తి దొరికింది. నీ ఋణం ఎలా తీర్చుకొంటామో?" అన్నారు ఏకకంఠంతో.

ఒకడు ఉదయనుడి మోచేతిని కారుతున్న రక్తం చూచాడు. "చూస్తారేమ్రా! పసరు తెండి," అని కేకవేశాడు.

వాడు పసరు తెచ్చి చేతికి రాచి కట్టు కట్టాడు. అప్పుడు ఉదయనుడు వాళ్లనందరినీ తీసుకుని కొలనువైపు వెళ్లాడు. తీరా చూడగా అక్కడ కొలనూ లేదు, చుట్టుప్రక్కల చెట్లూ లేవు తనలాగనే రాక్షసుడిని తెగటార్చటానికి వచ్చి శిలలుగా మారిపోయిన దురదృష్టవంతుల ప్రతిమలు మాత్రం నిలిచివున్నై.

ఉదయనుడికి ఏమీ అర్థం కాలేదు. 'కొలను ఏది?' అని అడిగాడు. "ఇంకా కొలను ఎక్కడుంటది బాబూ! దేవి మాయం కావటంతో అన్నీ మాయమయిపోయినై" అన్నాడు ఒకడు.

"మరైతే ఈ శిలాప్రతిమల గతేమిటి?" అని ఆత్రంతో ప్రశ్నించాడు ఉదయనుడు.

"అల్లగతి అంతే! కొలను కాస్తాపోయె! అల్లను మామ్మూలు సరూపాలు ఎలా గొస్తయ్?" అన్నారు సేవకులు.

"అయ్యో! ఎంత దారుణం! నిష్కారణంగా యిందరి ప్రాణాలు హరించిపోవటానికి కారకుణ్ణయానే" అంటూ విచారించసాగాడు ఉదయనుడు.

అటుతరువాత, 'సోదరుడు నిశీధుడు ఏమయ్యాడో, ఆ గెడ్డపువాడు ఏమయ్యాడో. రాకుమార్తె లేమయ్యారో తెలియలేదు. తెలుసుకోవాలి' అన్నాడు ఉదయనుడు.

"మరి పదండి" అన్నారు సేవకులు.

"అలాకాదు. మీరంతా యిక్కడే ఉండండి" అని వాళ్లనక్కడ కాపలాపెట్టి సంధ్యనీ, యితర పరివారాన్నీ తీసుకుని, వెంటనే ఉదయనుడు బయలుదేరాడు. ముందుగా అతడు ప్రతాపుడి రాజ్యం చేరుకుని భోగట్టాచేశాడు.

"అక్కే ఎవరూ రాలేదు. నీవు అప్పుడు వెళ్లటం, నిన్ను మళ్లీ యిప్పుడే చూడటం. ఆ రాక్షసుడిని తప్పించుకుని ఎలావచ్చావోయ్?" అని ప్రశ్నించాడు ప్రతాపుడు.

"వాడిసంగతే తెలియలేదు. అయితే, వాడి మాయాభవనంమాత్రం మట్టిపాలు చేసివేశాను. దానికేంగాని, ముందు నా సోదరులూ, రాకుమార్తెలూ ఏమయారో తెలుసుకోవాలి" అన్నాడు ఉదయనుడు.




"కావాలంటే నా పరివారాన్నికూడా పంపుతా" నన్నాడు రాజు ఎంతో దయతో.

'మీ అభిమానంపుంటేచాలు' అంటూ ఉదయనుడు ప్రతాపుడివద్ద సెలవుతీసుకుని మళ్లీ పరివారంతో సాగిపోయాడు.

* * *

ప్రతాపుని సేవకులను తోడుతీసుకువెళ్లిన నిశీధుడు ఏమయాడో తెలుసుకుందాం!

అదనుచూచి, ప్రతాపుడి సేవకులు నిశీధుడి తల తెగవేసి ఒక అరణ్యంలో



"నాయనా! విచారించి ప్రయోజనం లేదు. దుఃఖించకు, నేనూ నీవెంటవస్తాను. కలసిపోదాం, పద. నేను చేయగల ఉపకారమల్లా ఒక్కటే: ప్రాణం పోయటం నాచేతకాదు. కాని, ఎంతకాలమైనాసరే: ఈ కళేబరము చెడిపోకుండా నిలవచేయగలను' అని ఓదార్చాడు ఋషీశ్వరుడు.

'అంతకంటె కావలసిందేమున్నది! ఈ ఆపదసమయంలో మీరు దేముడిలాగా వచ్చారు. మనం ఈస్థితిలో శ్రావస్తి చేరుకుంటేచాలు, తరువాత సంగతి ప్రభువులే ఆలోచించగలరు' అన్నాడు మంత్రి. అదేప్రకారం వారు శ్రావస్తి చేరుకొన్నారు.

నిశీథుని కళేబరంతోసహా లోపల ప్రవేశించేసరికల్లా అందరూ కొయ్యబారిపోయారు. సంధ్య, ఉదయనుడూ, వాళ్ల ముసలితల్లీ పేగులు తరుక్కుపోయేట్టు విలపించారు. రాజూ, పరివారమూ దుఃఖ సాగరములో మునిగిపోయారు. ఋషీశ్వరుడు అందరనూ ఓదారుస్తున్నాడు. ఈ స్థితిలో గెడ్డపువాడుకూడా ప్రవేశించాడు.

ఐతే—గెడ్డపువాడు ఎటువంటి విచిత్రమైన పరిస్థితుల్లో ఇక్కడకు చేరుకొన్నాడో తెలుసా? వాడిని తన మాయాభవనంలో

పారవేసి చక్కాపోయారు. మరునాడు, ఆ చుట్టుప్రక్కల ఒక ఆశ్రమప్రాంతంలో వుంటున్న ఒక ఋషీశ్వరుడు ఆ దారిన వస్తూ, నిశీథుడి తలా మొండెమూ చూచాడు. వాటిని తన ఆశ్రమానికిచేర్చి, వాటికి సంబంధించినవాళ్లెవరైనా వస్తారా అని ఎదురుతెన్నులు చూస్తూ వున్నాడు.

కొద్ది రోజులకే దానశీల మహారాజు పంపిన ఆయన మంత్రి ఈ ఋషీశ్వరుని ఆశ్రమం చేరుకోవటం తటస్థించింది. నిశీథుని తలా మొండెమూ చూచి గుర్తుపట్టాడు. "అయ్యో! ఇదేమిఘోరం!!" అంటూ గుండెలు బాదుకున్నాడు.

వదిలితే ఏదో మాయోపాయం పన్నుతాడనీ, తనకు ముప్పుతెస్తాడనీ రాక్షసుడికి మొదటి నించీ అనుమానమే. అందుచేత సంచారానికి బయల్దేరినప్పుడు వాడినికూడా తనవెంట తీసుకపోయాడు.

ఒకసారి రాక్షసుడు గెడ్డపువాడిని వెంటబెట్టుకొని ఆకాశమార్గాన సంచరిస్తున్నాడు. దిగువఅంతా మహాసముద్రం. సరీగా ఇదేస్థితిలో ఉదయనుడు దేవిచేతిపైన వుండే గెద్దని పడగొట్టటం జరిగింది. ఇక్కడ ఉదయనుడు గెద్దను పడగొట్టడమేమిటి, ఆకాశమార్గాన గెద్దరూపంలో వున్న రాక్షసుడు నిజరూపంపొంది, హరీమంటూ సముద్రంలో పడి ప్రాణాలు విడవడమేమిటి? రెండూ ఒకేమాటు జరిగినై.

మరి—గెద్దతోపాటు మన గెడ్డపువాడూ ఉన్నాడుగా? వాడూ సముద్రమధ్యంలో పడ్డాడు. కాని, శ్రమపడి ప్రయత్నించి, రెండు రోజులపాటు ఈదుకొనివచ్చి కొనప్రాణాలలో ఒడ్డుకి చేరుకోగలిగాడు.

మాయాభవనం మట్టిపాలయిందనీ ఇక వివిధమైన బాధలూ ఉండవనీ గ్రహించాడు గెడ్డపువాడు. ముందుసంగతి యేమిటా అని యోచిస్తూ, తను చేరుకొన్న



ఊరుఏదో అక్కడివాళ్లని భోగట్టాచేశాడు. అది శ్రావస్తి నగరమని వాళ్లుచెప్పగానే, అతని ఆనందానికి మేర లేకపోయింది.

కాని, వాడు ఎంతో ఉత్సాహంతో రాజభవనం ప్రవేశించేసరికల్లా అంతా గోలగోలగా వున్నదాయె! అయితేనేం?

ఎన్నెన్నో వ్యూహాలు ఛేదించుకువచ్చిన మొనగాడు గెడ్డపువాడంటే. ఖ్యాతిపొందిన రాక్షసుడిచేతిలోమసిలినవాడు. మామూలు మానవులలాగా ప్రతివిషయంలోనూ అధైర్యం చెందుతాడా? అందరినీ ఊరడించాడు. 'ఇప్పటివరకూ అంతా సవ్యంగానే నడిచింది. కంగారుపడవద్దు" అన్నాడు.



ఉదయనుణ్ని చేరబిలిచి చాడు 'అబ్బాయీ! ఇదంతా ప్రతాపుడి కుట్రే కాని వేరుకాదు. భస్మాలూ అంజనాలూ వాడే కాజేసివుంటాడు. ముందు వాటిని తిరుగా చిక్కించుకోవాలి ఈపనిచూడు' అన్నాడు.

క్షణమైనా నిలవలేదు ఉదయనుడు. దాశశీల మహారాజుగారి సైన్యాన్ని తీసుకున్నాడు. గెడ్డపువాడిని వెంట బెట్టుకుని, మాళవరాజ్యం చేరుకున్నాడు. నగరం చూడబోతే—పందిళ్లతో, పచ్చటి తోరణాలతో కళకళ్లాడుతూ వున్నది. ఈ వేడుకంతా యేమిటీ అని భోగట్టా వేయగా, ప్రతాప మహారాజులుంగారికి ఒక్కసారిగా ముగ్గురు మహారాణీలు రాబోతున్నారని, అబ్బురంగా చెప్పుకొంటున్నారు అందరూ.

గెడ్డపువాడు చెప్పిన సూచనలు అక్షరాలా నిజమయేటట్టుగానే తోచింది ఉదయనుడికి. ఆశ్చర్యంతో వాళ్ళు మహలు ప్రవేశించారు. పెళ్లిపీటలమీద వరసన సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలు ముగ్గురూ తీర్చికూర్చుని వున్నారు. కులుకుతూవున్న ప్రతాపుడు మూడు మంగళసూత్రాలు చేతపట్టుకొని వున్నాడు:

ఉగ్రమూర్తిఐనాడు ఉదయనుడు. ఒక్క లిప్తలో బాకుదూశాడు. కాని, గెడ్డపువాడు అడ్డుకొన్నాడు. అంతలోనే సైన్యమంతా కోటని ముట్టడివేసింది. ప్రతాప మహారాజుకి బేడీలు తగిలించగానే ఆయన తెల్లబోయి, నిశ్చేష్టుడయ్యాడు. చేసేదేమున్నది? కథ అడ్డం తిరిగింది !!

ప్రతాపుడు 'దాసోహం' అన్నాడు. తప్పులన్నీ వప్పుకొన్నాడు. కాజేసిన భస్మాలూ అంజనాలూ వప్పగించివేశాడు ఒక్క మాటలో చెప్పాలెనంటే, ఉదయనుడితోనూ గెడ్డపువాడితోనూ "బాబూ, మీ బానిసను. నా సర్వస్వము మీదే. మన్నించండి," అని క్షమాపణ చెప్పుకొన్నాడు.



ఎన్నో కష్టాలకోర్చి, గండాలు గడిచి, తమను రక్షించటానికి జీవితాలనే అర్పించటానికి సిద్ధపడిన సాహసుడు ఉదయనుణ్ణి చూడగానే రాకొమార్తెలు ముగ్గరకూ ప్రాణం లేచి వచ్చింది. చెప్పలేని అవేశంతో ఉదయనుడివద్దకు వచ్చారు. అప్రయత్నంగా జలజలమంటూ వారి కన్నుల వెంట ఆనంద బాష్పాలు రాలినై.

ఐతే—ఉదయనుడి చెయ్యి మొండిగా వుండటం వాళ్లు వెంటనే కనిపెట్టివేశారు. నిజానికి, ఈ సందడిలో అతని చెయ్యి సంగతి అందరూ మరిచేపోయారు. కాని, సారథిఐన గెడ్డపువాడు నించున్నపాటున పాతాళగృహానికిపోయి, అక్కడ పడివున్న ఉదయనుడిచేతిని స్వయంగా పట్టుకవచ్చాడు. అంజనాలు ప్రయోగించి చేతిని మామూలుగా అతికించివేశాడు.

మరొక చిత్రమేమిటంటే - రాకొమార్తెలను రాక్షసుడు మూగివాళ్లనుగా చేసి వదిలాడుకదా? అయితే, దేవిచేతిలో గెద్ద ఎప్పుడైతే పోయిందో రాక్షసుడు అప్పుడే పోయాడు. రాక్షసుడితోనే పోయినై వాడు ప్రయోగించిన మాయలన్నీ. ఆ మాయలలో ఒకటైన రాకుమార్తెల మూగతనమూ పోయింది. ఇప్పుడు వాళ్లు మామూలుగా చిలకల్లాగా మాటాడుతున్నారు.

ఈవిధంగా రాకుమార్తెలనేగాక మాళవ రాజ్యలక్ష్మినికూడా సంపాయించుకు వచ్చిన ఉదయనుడు అందరనూ వెంటబెట్టుకుని శ్రావస్తిలో అడుగుపెట్టాడు.

గెడ్డపువాడు భస్మాలు, అంజనాల ప్రభావంతో నిశీధుని తలా మొండెము అతికించి, జీవంపోశాడు.

రాజ్యంలోని ప్రజయావన్మందీ ఆనంద డోలికలలో తేలిపోయారు. రాజూ రాణీ 'కవలలఋణం ఎన్ని జన్మాలకైనా తీర్చుకోలే' మంటూ వాళ్లని వినుతించారు.

అప్పుడు కవలలు ముగ్గురనూ దానశీల మహారాజు చేరదీసుకుని, సుహాసిని చేతిని ఉదయనుడి చేతిలోనూ, సుభాషిని చేతిని సంధ్య చేతిలోనూ, సుకేశిని చేతిని నిశీధుని చేతిలోనూ ఉంచాడు. గురుతుల్యుడైన గెడ్డపువాడు దీవించగా, ముగ్గురు కవలలకూ ముగ్గురు రాకొమార్తెలకూ అతి వైభవంగా వివాహం జరిగింది.

తరువాత దానశీలమహారాజు గెడ్డపువాడిని మాళవదేశానికి అధిపతిగా ఉండమని కోరాడు. కాని సర్వసంగపరిత్యాగి, నిమిత్తమాత్రుడు ఐన గెడ్డపువాడికి రాజ్యాలెందుకు! ప్రతాపుడు పశ్చాతాపం తెల్పగా, అతనిరాజ్యం అతనికి తిరుగా ఇప్పించివేశాడు.

తరువాత మహారాజు తనరాజ్యాన్ని ముగ్గురు కవలలనూ పంచుకోమనికోరాడు. కాని, కవలలు ఎంతమాత్రమూ అందుకు ఆశపడలేదు. సర్వసమర్థుడైన ఉదయనుడు తను రాక్షసుడి భవనంలో చేజిక్కించుకొన్న గుడ్లు మూడూ బయటికితీశాడు. కొంతకొంత దూరాన విడివిడిగా గెడ్డపువాడి సలహామీద వాటిని మూడుచోట్లపెట్టి బద్దలగొట్టేసరికి, అక్కడ వరసగా వెండికోటా, బంగారు కోటా, రత్నాలకోటా మూడూ ఏర్పడినై. స్వయంగా నిర్మించుకొన్న ఆ కోటలలో కవలలు ముగ్గురూ సుఖంగా ఉంటున్నారు.

ఇంత హడావిడిలోనూ వారు ఒక్క విషయంమటుకు మరువలేదు. దుష్టరాక్షసుడి బలికి ఆహుతి అయి శిలలుగా మారిన పోయిన ఆ ప్రతిమల సంగతి ఉదయనుడి మనసులో బాధిస్తూనేవుంది. ఆ మహావీరులకు స్మారకచిహ్నంగా ఒక చక్కటి భవనం నిర్మించి, ఆ భవనం చుట్టూ - ఈ ప్రతిమలను స్తంభాలుగా అమర్చాడు.

[విచిత్రకవలల కథ ముగిసింది]






పూర్వకాలమందు అమరావతిలో ఒక గొప్ప కళాకేంద్రం ఉండేది. దేశదేశాల నుండి విద్యార్థులు వచ్చి ఆ కేంద్రంలో చిత్రకళలు అభ్యసించేవారు. అక్కడి విద్యార్థు లందరిలోనూ రత్నఘోషుడనే బాలుడు అతి రమణీయమైన చిత్రాలు సృష్టించగలిగేవాడు. అవి చూచినవారం దరూ 'ఇతడు ముందుముందు గొప్ప చిత్రకారు డవుతాడు, దేశానికి ఖ్యాతి తీసుకువస్తాడు' అని అనుకొనేవారు.

ఆ కళాకేంద్రంలోనే జయప్రభ చంద్రప్రభఅని మరిద్దరు పిల్లవాళ్లుకూడా చిత్రకళ నేర్చుకొంటున్నారు. నలుగురూ రత్నఘోషుని ప్రశంసించటం చూచి, తోడివాళ్లయిన ఈ యిద్దరికీ మనస్సులో రకరకాలైన భావాలు కలగజొచ్చినై.

జయప్రభ వట్టి కుళ్లుమోదు. ఎన్నాళ్లు నేర్పినప్పటికీ రేఖలు గీయటమే సరిగా చేతనైంది కాదు. ఇక బొమ్మలు వేసే దేమిటి? వాటికి రంగులు పులిమేదేమిటి? వెయ్యి జన్మలెత్తినా రత్నఘోషుని సమీపాన ఉండటానికే తనకు అర్హత లేదని నిశ్చయించుకున్నాడు. అందుకని క్రమంగా అతనిపైన అసూయ బయల్దేరింది. రత్నఘోషునిపయిన లేనిపోని అపనిందలు కల్పించి ప్రచారంచేసి, అతని కీర్తి రూపుమాపుదామని సంకల్పించాడు.

నాటినించీ ఎలాగో రత్నఘోషుని ప్రసక్తి తీసుకవచ్చి, "వాడి కళాకౌశలం ఏమిటో నాకు తెలుసునయ్యా. ఆ చిత్తరువు వాడికి మేష్టారే వేసిపెట్టారు. లేకపోతే అంత పసందుగా వేయగలడేం, వాడి మొహం!" అని అనేవాడు. "మళ్లీ ఇంకొక బొమ్మ వేయమనండి మాతాం!" అని సవాలుచేసేవాడు.

పోతే—రెండవవాడైన చంద్రప్రభ చిత్తవృత్తివేరు. ఇతడు ఇప్పుడిప్పుడే చిత్రకళ

డి. హరనాథ్ — ఋషివాలీ




ప్రారంభించాడు. ఏనాడైతే రత్నఘోషుని బొమ్మలను చూచాడో, అప్పటినించీ అతనిని తన గురువుగా భావించుకొన్నాడు. గురువు చిత్తరువులను ఎవరైనా ప్రశంసించినప్పుడు చంద్రప్రభకు ఆనందంతో ఒళ్లు పులకించేది. 'ఈ జీవితంలో ఎప్పటికైనా నేను గురువుగారంతటి వాడను కాగలనా? అంతటి చక్కటి బొమ్మలు వేయగలుగుతానా? అయనను పొగడినట్టే నన్నూ లోకులు మెచ్చుకునే సుదినం ఏనాటికైనా వస్తుందా?'—అని ఈ మోస్తరుగా అతడు లోలోన ఉవ్విళ్లూరుతూ ఉండేవాడు. తన గురువునకు ప్రతికూలంగాచేసే దుష్ప్రచారం చూచినపుడెల్లా భరించలేక, చంద్రప్రభ ఎంతగానో విచారించేవాడు.

చంద్రప్రభ రత్నఘోషుని చిత్తరువులనే మనసులో పెట్టుకుని, అతి దీక్షతో పనిచేయసాగాడు. నిద్రలోకూడా అతనికిదే ఆలాపన!—'అబ్బా! రత్నఘోషుని బొమ్మకూ నాబొమ్మకూ ఎంత వ్యత్యాసమున్నదో! అతని బొమ్మలాగ సరిగా నే నెప్పటికి వేయగలనో?' అని తపించిపోయేవాడు.

కొద్దికాలం కృషిచేయగానే అతని బొమ్మలు రత్నఘోషుని బొమ్మలకు సమీపానికి రాసాగినై. ఇద్దరి బొమ్మలకూ చాలా పోలికలు కనబడజొచ్చినై. ఈ ఊత చూచుకొని, చంద్రప్రభ 'నేను త్వరలోనే రత్నఘోషుడి నైపోతా'నని ధైర్యంచెందాడు.

ఇలావుండగా—ఒకసారి కళాకేంద్రంలో ఒక బ్రహ్మాండమైన చిత్రప్రదర్శనం జరిగింది. ఆ ప్రదర్శనానికి ఖండాంతరాల నుండి పేరుమోసిన చిత్రకారులు వారివారి చిత్రాలను పంపించారు. ఈ ప్రదర్శనానికి రత్నఘోషుడుకూడా ఒక చిత్తరువు తయారుచేశాడు. అంతా పూర్తి అయింది. ఇంక తైలంతో మెరుగుపెట్టడమే తరువాయి. రత్నఘోషుడు చిత్రించిన చిత్రా




లన్నిటిలో ఇది మేటిచిత్రం. బహుమతి అతనికే వస్తుందని లోకం కోడై కూసింది.

రత్నఘోషునికి ఇంతటి కీర్తి వస్తుందంటే జయప్రభకు కన్ను కుట్టింది. తనకు ఎలానూ ఊరుపేరూ లేదు. స్నేహితుడికి ఖ్యాతి రావటం సహించలేడు. అందుకని అసూయాగ్రస్తుడై జయప్రభ ఏమిచేశాడంటే రత్నఘోషుడు ఆదమరిచివుండగా రాత్రికిరాత్రికి అతనియింటికి వెళ్లాడు. మాయోపాయంచేసి, కూడా తెచ్చిన ద్రావకాన్ని తీసి రత్నఘోషుడు చిత్రానికి వేయదలిచిన తైలంలో కలిపివేశాడు. రత్నఘోషుడు తన చిత్రానికి మెరుగులుపెట్టి అద్భుతంగా ముగించాడు.

* * *

మరునాడు ప్రదర్శనశాల కిటకిటలాడుతున్నది. రత్నఘోషునికే బహుమతి వస్తుందని ఏనాడో నిశ్చయించుకొనివున్న ప్రజ కుతూహలంతో వేచిఉన్నారు. పరీక్షాధికారులు ముందుగా రత్నఘోషుని బొమ్మకు కట్టివున్న తెరను ఉత్సాహంతో తొలగించారు. ఏమున్నది! బీటలు వారి మచ్చలుతేరిన వట్టి రంగులుతప్ప బొమ్మా లేదూ, ఆకారమూ లేదు!!

'అబ్బే! ఇది రత్నఘోషుని చిత్తరువు కాదు' అన్నారు అందరూ. 'రత్నఘోషుని చిత్తరువు అయివుండదు' అన్నారు పరీక్షాధికారులు కూడా. రత్నఘోషుడు వచ్చాడు. చూచుకొన్నాడు. 'నేటితో నాపని సరి...!!!' అంటూ నిస్పృహతో నేలకు ఒరిగాడు.

అంతలో చంద్రప్రభ కంగారుగా వచ్చాడు. చూచాడు. 'ఇదేమిటి! ఇది రత్నఘోషుని చిత్తరువే. కాని, ఇలా మారిపోయిందేమిటి! కపటం! మాయ!! మోసం!!! ఆయన ఈ బొమ్మ వేసినప్పుడు నేను కళ్లారా చూచాను అదుగో, అంత లలితమైన రేఖలు వేయగల దివ్యహస్తం

ఈ దేశంలో మరెక్కడున్నది?—ఏదో దారుణం జరిగింది !!

నిజం నిలకడమీద తెలియకపోదు. అధికారులు కనుక్కోవాలి. చర్య తీసుకోవాలి' అంటూ అనేకవిధాల వాపోయాడు.

అధికారులుకూడా రత్నఘోషునికి కలిగిన కష్టదశకు జాలిపడ్డారు. చిత్తరువులోని రేఖలు చూచి ఆశ్చర్యం చెందారు. ఐతేనేం, అస్థితిలో అతని చిత్తరువుకు బహుమానం ఈయలేమన్నారు. తరువాత హాలులోని చిత్రాలన్నింటిలో ఒక్కటిమాత్రంవారికి నచ్చింది. అది ఎవరిదీ అని చూడగా, చంద్రప్రభవేసినదే!! అతనికి బహుమతిఇచ్చారు.

చంద్రప్రభ వెంటనే ఆ బహుమతిని రత్నఘోషువద్దకు తీసుకపోయి, 'మిత్రమా!— నీ కౌశలం ఎటువంటిదో నాకు తెలుసు. లోకానికి తెలుసు. పరీక్షాధికారులకు తెలుసు. కాని ఏంచేయగలం? దారుణం జరిగింది. అలా జరగని పక్షమందు ఈ దేశంలోనే కాదు, ప్రపంచమంతటా నీ పేరు మ్రోగిపోయేదికదా! ఈ బహుమతి నీదేకాని నాదికాదు. నేను తీసుకొవటానికి నాకు అర్హతలేదు. కనుక, నీవే తీసుకో. నీకు నేను రెండవవానిగా ఉండటమే గౌరవంగా భావిస్తాను. నిన్ను మించటానికి నేను ప్రయత్నిస్తున్నాను. అయితే, నేర్పుచేత, సాధనచేతనే నీ అంతటివాడ నవుతాను కాని, ఇటువంటి తుచ్ఛపు పనులవల్ల మాత్రం కాదు.' అంటూ హృదయావేదన వెల్లడించాడు.

చంద్రప్రభ చర్యచూచి పరీక్షాధికారులు నిశ్చేష్టులయ్యారు. "ఈసారి రెండు బహుమతులు నిర్ణయిస్తున్నాము. చిత్తరువుకు బహుమతి పొందటానికి రత్నఘోషుడే అర్హుడైతే, సౌశీల్యానికి బహుమతి పొందటానికి చంద్రప్రభ అర్హుడు" అని చెప్పి, ఇద్దరకూ చెరివక బహుమానమూ ఇచ్చి సన్మానించారు.





# చెప్పుల దొంగ

భీమునిపట్నంలో ఒకప్పుడు పతంజలి శాస్త్రి అనే సంపన్నగృహస్థు ఉండేవాడు. ఆయనకు ఉత్తరదేశ యాత్ర చెయ్యాలెనని బుద్ధిపుట్టి, కావలసిన సొమ్ము మూట గట్టుకుని ఒక మంచిరోజున బయల్దేరేడు. పుణ్యక్షేత్రాలూ, యాత్రాస్థలాలూ ఒక్కొక్కటే చూసుకుంటూ చివరికి ఢిల్లీ చేరుకున్నాడు. 'ఈ మహానగరంలో చూడతగ్గ వింతలూ, విశేషాలూ ఏమిటండీ?' అని ఎదురైన ఒకాయనను అడిగితే ఆయన ఒక జాబితా ఏకరుపెట్టి, 'జుమ్మామశీదనే ఒక గొప్ప మశీదు ఉంది. అదిగూడా చూడతగ్గదే' అన్నాడు. పతంజలిశాస్త్రి 'సరే'నని బయల్దేరి ఒక్కొక్కటే చూసుకుంటూ కొసకి ఆ మశీదుకి చేరుకున్నాడు.

ఉత్తరదేశంలో అంతా కాళ్లకి చెప్పులు తొడుక్కుంటారు. ఐతే, దక్షిణదేశంలో తొడుక్కునేవాళ్లకన్న తొడుక్కోనివాళ్లే ఎక్కువ. పతంజలిశాస్త్రికికూడా జోడు అలవాటు లేదు. కాని ఆ ఉత్తరాది యాత్రలో అందరి కాళ్లనూ పాదరక్షలు ఉండటం చూచి తనుగూడా ఒక జోడు కొనుక్కుంటే బాగుంటుందని తోచింది.

అందుకని ఢిల్లీలో మంచి అందమైన చడావులజత ఒకటి బేరంచేసి కొన్నాడు. ఆ జోడుతోనే సరదాగా అతడు జుమ్మామశీదు చూదామని వెళ్లాడు. మశీదు గుమ్మంవద్దనే అందరూ తమ జోళ్లను వదలి లోపల ప్రవేశించటం చూశాడు. అతడుకూడా అలానే చేశాడు.

జుమ్మామశీదు నిజంగా చూడతగ్గ భవనం. కొన్ని కోట్లరూపాయలు ఖర్చుపెట్టి పూర్వం ఒక ఢిల్లీచక్రవర్తి దాన్ని కట్టించాడు. ఆ మహాభవనాన్ని చూస్తూ విస్తుపోయాడు పతంజలిశాస్త్రి. అక్కడికి ముసల్మానులు రకరకాల విలువైన దుస్తు

యస్. సూర్యారావు – గుంటూరు




లతో వచ్చి, మోకరిల్లి నమాజు చేసుకుంటున్నారు 'అల్లాహెూ అగ్బర్' అనే కేకలు వినపడ్డాయి. వాళ్ల భక్తికి అతడు మెచ్చుకున్నాడు.

అంతా బాగానే ఉందిగాని, అతని గుండెలో ఒక చిన్న భయంమట్టుకు ప్రవేశించింది—'ఇంతమంది తురుష్కుల మధ్య హిందువునైన నేను ఒంటరిగా ఉండటం ప్రమాదం కాదా? వాళ్లు, తమ మశిదులో హిందువులు ప్రవేశిస్తే ఊరుకుంటారా?' అని. క్షణంలో ఆ భయం ఎక్కువై శాస్త్రి కలవరపడ్డాడు. 'ఎవరూ నన్ను గుర్తుపట్టకుండానే ఇక్కడనుంచి తప్పించుకుపోవాలి' అనుకుంటూ అతడు మెల్లగా వెనక్కి తిరిగేడు.

తిరిగేసరికి అప్పుడే మశీదు ప్రవేశించి, గుమ్మంవద్ద చడావులు విడుస్తూన్న అజానుబాహు పఠాను ఒకడు అతనికి కనపడ్డాడు. ఆ నల్లటి జునపాలూ, ఎర్రటికళ్లూ, బుగ్గమీసాలూ, విశాలమైన వక్షస్థలం—వీటితో భూమి అదిరేటట్లు నడచి వస్తూన్న అతణ్ణి చూసేసరికి శాస్త్రి గుండె పీచుపీచుమంది. ఆ పఠాను మొలలో బాకుకూడా ఉంది! అంతకంటే యేం గావాలి! శాస్త్రి వణకడం మొదలెట్టేడు. లోపల ప్రవేశిస్తూవున్న పఠాను దృష్టి యథాలాభంగా శాస్త్రిపైన పడింది. వెలవెలబోతూన్న ఆ ముఖం చూసేసరికి అతడికి ఏదో అనుమానం కలిగింది; శాస్త్రికేసి చూస్తూనే అడుగులు వేసుకొంటూ లోపలికి వచ్చాడు. ఆ పఠాను కన్ను తనమీద పడిందనీ, ఆ బాకుతో వాడు తన్ను పొడిచేస్తాడేమోననీ అనిపించి, శాస్త్రి ఉరకలేసుకుంటూ గుమ్మం చేరుకున్నాడు. అదంతా కనిపెడుతూన్న పఠానుకి అనుమానం ఎక్కువై, చూస్తూ నిలబడ్డాడు. శాస్త్రి ఖంగారుగా చడావులు తొడుక్కుని చప్పుడు చేసు




కుంటూ మెట్లు దిగేడు. ‘అరె, బద్మాష్; ఈ మదరాసీ నా చడావులు తొడుక్కు పోతున్నాడే! చెప్పులదొంగ! ఇందుకా ఈ ఈ కాఫర్ ఇక్కడకు వచ్చింది?’ అని ఉరిమాడు పఠాను. ఆ చెప్పులు ఆ ‘కాఫరు’వే ఐఉంటాయేమో అన్న ఆలోచన శాస్త్రికి తోచలేదు. ఏమంటే అతడు చూసిన మద్రాసీ ఎవడూ ఇదివరలో చెప్పులు తొడుక్కుని కనపడనేలేదు!

శాస్త్రిని పట్టుకోవాలని పఠాను రెండు ఉరకలలో గుమ్మందగ్గరకు చేరుకున్నాడు. అతడు తరుముకొస్తున్నాడని గ్రహించి శాస్త్రి ఆదారిని పోతూన్న ఒక టోంగా (ఢిల్లీలో ఉండే గుఱ్ఱపు బండి) లోకి ఉరికి బండివాడితో “తొరగా పోనియ్యి” అన్నాడు. “అరె! నిన్ను పారిపోనిస్తానా?” అంటూ పఠాను మరో టోంగాలో ఎక్కి శాస్త్రిని తరుముకెళ్ళేడు. శాస్త్రి తన బండివాడితో, “వాడు మనవెంట పడ్డాడు. తప్పించుకు పారిపోవాలి! త్వరగా తోలు. మంచి బహుమానం ఇస్తాను” అన్నాడు.

“పోనివ్వకు. వాణ్ణి పట్టుకోవాలి. మంచి బహుమానం ఇస్తాను. వేగంగా తోలు” అన్నాడు పఠాను, తన టోంగావాలాతో.

ముందు శాస్త్రిటోంగా, వెనకాల పఠాను టోంగా వాయువేగంతో పరుగెత్తసాగినై. గంటసేపు పరుగెత్తేసరికి రెండుగుఱ్ఱాలూ కూడా అలసిపోయాయి.

అది పనికాదని తోచి పఠాను తన బండిలోంచి “దొంగ, దొంగ! ఆపండి!” అని కేకలు వేశాడు. ఎదురుగా వస్తున్నవాళ్ళెవరో ఆ కేకలు విని, శాస్త్రి బండిని ఆపుచేసేశారు. శాస్త్రి వాళ్ళమధ్య దూరి, “శరణు, శరణు రక్షించండి; నేను తెలియక మసీదులోకి వెడితే ఈ సాయేబు చంపుదామని తరుముకొస్తున్నాడు.” అని యేడుస్తూ చెప్పటం మొదలెట్టేడు.

అందుకు పఠాను, "అరె; ఎంతలో ఎంత కథ అల్లినావ్‌రా? నా ఛడావులు ఎత్తుకొచ్చి, కల్లీబొల్లీ యేడ్పు యేడుస్తావ్?" అని అరిచాడు. శాస్త్రి విస్తుబోయి, "ఏమిటి? నీఛడావులా? నావే ఇవి నిన్ననే కొన్నాను" అంటూ తన పాదరక్షలకేసి చూసుకున్నాడు. పఠానూ చూశాడు. ఇద్దరూ ఆ ఛడావులకేసి దృష్టిసారిస్తూ నిశ్చేష్టులై నిలబడ్డారు, "క్యా, క్యా?" అంటూ బండి ఆపినవాళ్లుకూడా నిశ్చేష్టులయి అడిగేరు. "భాయ్, ఇందులో ఒక ఛడావే నాది. కంగారులో రెండోఛడావు ఎవరిదో తొడుక్కొచ్చేశాను" అంటూ శాస్త్రి ముందు మాట్లాడేడు. అందుకు పఠాను, "ఎవరిదో గాదు, నాదే ఆ రెండో ఛడావు. నా రెండు ఛడావులూ నువ్వు దొంగిలించబోయి ఖంగారులో ఒకటి నాది, ఇంకొకటి మరొహడిదీ దొంగిలించావు!" అన్నాడు.

శాస్త్రి, "సాహేబుగారూ, జంఝం పట్టుకొని చెబుతున్నాను. ఈ చిన్నఛడావు నాదేనండీ. చూడండి నాకాలికి ఎలాగ సరిపోయిందో!" అని నచ్చచెప్పేడు. పఠాను ఆశ్చర్యపోతూ "ఐతే ఇప్పుడు నా రెండో చెప్పుకోసం నేను మళ్లీ మసీదుదాకా వెళ్ళాలన్నమాటా!" అన్నాడు. "మీరేకాదు; నేనూ రావాలి. ఈ ఒంటి చెప్పువల్ల నాకు మాత్రం ఏంలాభం?" అన్నాడు శాస్త్రి.

వాళ్లిద్దరూ ఎవరిటోంగాలో వాళ్లు మసీదుకువెళ్లేరు. సాహేబు తన రెండో ఛడావు కూడా తొడుక్కుంటూ, "షాస్త్రీ, ఈవేళ ఎవరికీ లాభంలేని దండుగబేరం ఐపోయిందివోయ్" అన్నాడు. శాస్త్రి నవ్వుతూ, "ఎవరికీ లాభం లేకపోవటమేమిటి భాయ్? ఈ రెండు టోంగావాళ్లకి మంచి కేవు దొరికిందీకాదా?" అని, సలాంచెప్పి, చల్లగా వెళ్లిపోయాడు.





# అన్నంభొట్లు పెళ్లి

ఉత్కళదేశాన్ని ఒకప్పుడు ఉపేంద్రవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయన తన బావమరదిఐన భుజంగవర్మను సైన్యాధిపతిగా చేసుకున్నాడు. భుజంగవర్మ పచ్చి దుర్మార్గుడు. దయా దాక్షిణ్యమూ అనేది ఏకోశానా లేకుండా తనను అభిమానించిన రాజునే హత్యజేసి ఉత్కళ సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు.

ఈ ఘోరం జరిగేనాటికి యువరాజైన అనంతవర్మ నగరంలో లేడు. 'నువ్వు వెడితివా, ఆదుర్మార్గుడు నిన్నూ హత్యచేస్తాడు' అని స్నేహితులు సలహాయిచ్చారు. అందుకని అనంతవర్మ పొరుగూరిలో మారువేషంతో రోజులు గడుపుతూవచ్చాడు.

ఐతే అనంతవర్మనికూడా కడతేర్చాలని భుజంగవర్మ వెతికిస్తూనే వున్నాడు.

అనంతవర్మ ఒకప్పుడు యువరాజే ఐనా, ఇప్పుడు కష్టదశలో ఉండటంవల్ల, ఏరోజు కారోజు పొట్టపోసుకోవటానికే శ్రమ పడవలసివచ్చింది.

అతడు ఒకరోజున అడవిలో పళ్లుకోద్దామని ఒక పెద్ద చెట్టు ఎక్కేసరికి గుఱ్ఱపుగిట్టల చప్పుడు వినపడింది. అతడు చెట్టుమీదే నక్కివున్నాడు. మరి కాస్సేపటికి ఒక యాభైమంది దొంగలువచ్చి గుఱ్ఱాల మీదనుంచి దిగేరు. వాళ్లలో ఇద్దరు ఆ చెట్టుకు పక్కగావున్న ఒక బండరాతిని పెల్లగించి పక్కకు నెట్టేరు. అక్కడ పెద్ద సొరంగం ఒకటి ఉన్నది. దొంగలు ఒక్కొక్కళ్లే తమ గుఱ్ఱాలమీదవేసి తెచ్చిన సొమ్ములు మోసుకుపోయి సొరంగం ప్రవేశించారు. చివరకు దొంగలనాయకుడు, నోటికి గుడ్డలుకుక్కి ఉన్న ఒక బాలికను బుజంమీద ఎత్తుకుని లోపలకు వెళ్లేడు.

చెట్టుమీద దాగివుండిన అనంతవర్మ అంతా పరికిస్తూనేవున్నాడు. మరొక గంట

తాతపూడి సోమయాజులు, అమలాపురం



సేపటికి దొంగలు ఒక్కొక్కళ్లే బయటకు వచ్చేసి, బండరాయిని యథాప్రకారం అమిర్చేసి, పైన ఎండుటాకులు కప్పేసి తమ తమ గుఱ్ఱాలుఎక్కి వెళ్లిపోయారు.

అనంతవర్మ చెట్టు దిగివచ్చి, పొదలో దూరి ఆ బండరాయిని పక్కకు నెట్టేసరికి, కిందికి మెట్లుకనిపించాయి. ఆ మెట్లవెంబడే దిగి వెళ్ళేడు. పోగాపోగా సొరంగం వుంది. అది విశాలమై, చివరి కతడొక పెద్ద భవనంలో ప్రవేశించాడు. ఒకగదిలో ఆ బాలిక వెక్కెక్కి యేడుస్తున్నది. అతడు వెంటనే ఆ పిల్లకున్న కట్లు విప్పేసి చూసేసరికి, ఆశ్చర్యం!—ఆ బాలిక ఎవరో కాదు! తన తండ్రిని హత్య చేసిన, భుజంగవర్మ కూతురు హేమలతే!

హేమలత అనంతవర్మని ఆనమాలు కట్టలేకపోయింది. ఆ గడ్డం, ఆ గుడ్డలూ, చూస్తే అతణ్ణి ఎవరూ పోల్చుకోలేరు. ఆమె అతని పాదాలపైనపడి, 'నన్ను ఈ దొంగలు కాళికాదేవికి బలిఇవ్వటానికి తీసుకొచ్చారు. నాపాలిటి దేవుళ్లు మీరు. నన్ను కాపాడండి!' అని ప్రాధేయపడింది.

'మా నాయనను చంపిన హంతకుడి కూతురును నేను కాపాడటమా!' అనుకున్నాడు అనంతవర్మ. ఐతేం, మరుక్షణం లోనే హేమలత దైన్యావస్థ చూసి జాలి పడ్డాడు. 'ఈ బాలిక తండ్రి నాకు అపకారంచేశాడని ఈమెనునేను ఏవగించుకోకూడదు. ఇంతకీ అపకారికిఐనా ఉపకారం చెయ్యమనేగా ధర్మం చెబుతోంది?' అనుకొని, అనంతవర్మ ఆమెను ఓదార్చి, క్షణమైనా ఆలస్యంచెయ్యకుండా ఆమెను అక్కడనుంచి తీసుకుపోయాడు.

హేమలతతోకూడా అనంతవర్మ పొరుగూరిలో ఒక బ్రాహ్మలయింట పెరట్లో మకాంపెట్టాడు. తాను ఫలానా అనేసంగతి ఆమెకు ఎంతమాత్రం తెలియనీయలేదు.



'నన్ను తీసుకువెళ్లి మా నాయనకు వప్పగించండి. ఆయన మిమ్మల్ని కృతజ్ఞతతో ఆదరించి, బహూకరిస్తాడు' అన్నది హేమలత. భుజంగవర్మ క్రూర భుజంగం లాంటివాడు. వాడిదగ్గిరకు వెళ్లటం కోరి అపద తెచ్చుకోవట మనుకున్నాడు అనంతవర్మ, "నేను వెళ్లకపోతే పోయె, ఈమెనైనా తలిదండ్రులవద్దకు పంపెయ్యాలి" అనుకుని, 'ఎవరిని తోడిచ్చి పంపటమా?' అని ఆలోచించాడు.



మర్నాడు అనంతవర్మ పళ్లకోసం అడవికివెళ్లి తిరిగివచ్చేటప్పటికి అతడు కాపరంఉన్న బ్రాహ్మడిఇంట్లో, 'ఈఅమ్మాయి ఆ రాజుగారి కూతురే ఐవుంటుంది. ఆ పిల్లని వీడే ఎత్తుకొచ్చివుంటాడు. మనం గప్‌చిప్పుగా వెళ్లి ఆరాజుగారికి వప్పగిస్తే, గొప్ప బహుమానం పొందవచ్చు' అని గుసగుసలాడుకుంటున్నారు.

ఆ బ్రాహ్మడికి అన్నంభొట్లు అనే కొడుకు ఒకడున్నాడు. వాడు, "బహుమానం అంటారేమిటండీ? 'నా కూతుర్ని తెచ్చి ఇచ్చినవాడికి ఆ పిల్లనిచ్చి పెళ్ళి చేస్తాను; అర్థరాజ్యంకూడా ఇస్తాను' అని కదా రాజుగారు చాటింపువేయించారు?" అన్నాడు. ఈ మాటలు అనంతవర్మ చెవిలో పడి, అతడు సంగతి సందర్భాలన్నీ చిటుకసేపటిలో గ్రహించివేశాడు.

వీళ్లు ఆశపడ్డారన్న సంగతి అనంతవర్మ కనిపెట్టి, 'అయ్యా, మీరు ఈ అమ్మాయిని తీసుకువెళ్లి రాజుగారికి వప్పజెప్పి, ఆయన వల్ల బహుమానం పొందిరండి. అడవిలో దొంగలు దాచివెడితే, రక్షించి తీసుకొచ్చామని చెప్పండి. మీరే తీసుకొచ్చినట్లు చెప్పండి. నాసంగతి చెప్పవద్దు' అన్నాడు.

హేమలతకూడా తండ్రి వేయించిన చాటింపు విన్నదిగనక, అనంతవర్మ తన పట్టంతోనే సంగతంతా చెప్పి, 'మనం




అన్నంభొట్లు భుజంగవర్మ సమక్షాన హేమలతను నిలబెట్టి దర్పంగా, 'మామ గారూ ఇదుగో మీ అమ్మాయి. ఒకళ్ళూ ఇద్దరూటండీ! ఐదువందలమంది ఐంది పోటుదొంగలను సొరకాయ తరిగేసినట్లు తలలు నరికేసి వదిలిపెట్టేను ఏమను కున్నారో!' అన్నాడు.

రాజూ, రాజసభలోవున్న తక్కినవాళ్లూ వాడి కోతలకి కడుపుబ్బేటట్లు నవ్వు కున్నారు. కూతుర్నితెచ్చి చూపించాడన్న సంతోషంకొద్దీ భుజంగవర్మ అన్నంభొట్లుకి రత్నకుండలాలు వేయించి, కాశ్మీర శాలు వులు కప్పి, ఒక అగ్రహారం ఇనాముగా ఇచ్చి, 'తరుచూ మా అస్థానానికి దయ చేస్తూవుండండి' అన్నాడు.

అన్నంభొట్లు, 'పిల్లనిచ్చి పెళ్లిచేసి అర్ధ రాజ్యం ఇస్తానంటివి కాదటయ్యా!' అని రాజును అడిగేడు.

అందుకు రాజు నవ్వుకొంటూ, 'సరే. మూఢం వెళ్లిపోయాక మంచిముహూర్తం పెట్టించుకురండి' అనిచెప్పి ఆ మూఢుణ్ణి మంచిగా పంపించేశాడు.

అన్నంభొట్లు ఇంటికొచ్చి, తల్లి కాసెమ్మతో 'అమ్మోయ్, మూఢం వెళ్లటం

ఇప్పుడే వెళ్లిపోదాం. ఇంక మీరు ఇలా ఇబ్బందిపడక్కర్లేదు' అంది.

అందుకు అనంతవర్మ, 'నేనురాను. ఈ బ్రాహ్మణుడు నాకు ఆశ్రయమిచ్చి ఉప కారంచేశాడు. ఆయనకు నేను ప్రత్యుప కారం చేయాలి ఇప్పుడు. ఈ బ్రాహ్మణునితో నువ్వు మీయింటికివెళ్లి, ఈయనే నిన్ను రక్షించాడని మీ తండ్రితో చెప్పి, ఈయన్ని ధనవంతుడుగా చెయ్యి' అన్నాడు.

అనంతవర్మని పెళ్లిచేసుకోవాలని అపిల్ల ఏనాడో నిశ్చయించుకొని వుంది. ఐతే, అతడు యిప్పుడు ఎందుకు రానం టున్నాడో ఆ అమ్మాయికేంతెలుసు పాపం?

తోనే నువ్వు రాణీగారికి వియ్యపరాలి వవుతావుసుమా!' అని ఎంతో ఉత్సాహంతో చెప్పాడు.

'యేడిశావులే. ఈమాటు మనం అక్కడికి వెడితే ఘారావాళ్లచేత గెంటిస్తాడురాజు!' అన్నది ఆమె.

'అలాగని నాకు పెళ్లిచేయించకపోతే నూతిలోపడి చస్తా!' నన్నాడు అన్నంభొట్లు.

'ఒరే, అబ్బాయీ! ఆపిల్ల మన పెరట్లో వున్న ఆ రాజుల కుర్రవాణ్ణేకాని చేసుకోదు. రేపో ఎల్లుండో, వాడికోసం కబురు చేయిస్తుంది. వీడు అక్కడికి వెళ్లటంతో నిజంతెలిసిపోయి, రాజు వీడికే ఆ పిల్లనిచ్చి పెళ్లిచేస్తాడు. అందుకని నువ్వు అపిల్ల మీద ఆశ వదులుకో. అగ్రహారం వచ్చిందిగా, చాలు' అంది.

అన్నంభొట్లు వప్పుకోలేదు. "ఈ రాజుల కుర్రవాణ్ణి, నిద్రపోతూండగా చూసి మోసుకుపోయి నూతిలో పారేద్దాం. వీడిశని విరగడైపోతే హేమలత నన్నుగాక మరెవణ్ణి పెళ్లిచేసుకుంటుంది?" అని వ్యూహం పన్నాడు.

ఆ రాత్రే తల్లీ కొడుకులిద్దరూ వెళ్లి, గాఢనిద్రలోవున్న అనంతవర్మను మోసుకు




పోయి దగ్గిర పాడునూతిలో పడేసి చక్కా వచ్చారు.

అక్కడ హేమలత తండ్రితో 'బ్రాహ్మడి యింట్లోవున్న అయన ఎవరో గొప్పయింటి రాజకుమారుడు. తన సంగతి గుట్టుగా వుంచాడు కాని ఎంతకూ చెప్పాడుకాదు' అంది.

ఆ రాజపుత్రుడెవరోచూసి తీసుకురావలసిందని భుజంగవర్మ సేనానాయకుణ్ణి పంపేడు. ఆ సేనాధిపతి కొంత పరివారంతో బ్రాహ్మణుని యింటికివచ్చి, 'మీ పెరట్లోవున్న రాజకుమారుడేడీ?' అని అడిగేడు.

'మాకు తెలీ' దన్నారు వాళ్లు.

జనంవచ్చిన కలకలం వినగానే, నూతిలో రాతిని అంటిపెట్టుకుని కొనప్రాణా లతోవున్న అనంతవర్మ కేకవేశాడు. అప్పుడు వాళ్లంతా అక్కడికివెళ్లి అనంతవర్మని పైకితీసి, 'ఇదేమిటి? నూతిలోకి ఎలా వచ్చావు?' అని అడిగారు. నిజం ఎక్కడ చెప్పేస్తాడోనని అన్నంభొట్లూ, కాసెమ్మా హడిలిపోయారు. కాని ఎవరికీ అపకారం చేయటం ఇష్టంలేని అనంతవర్మ, యుక్తిగా 'కాలుజారి పడ్డాను' అనిచెప్పి ఊరు కున్నాడు.

'రాను' అన్నప్పటికీ వదలక సేనాధి పతి అతనిని రాజువద్దకు తీసుకపోయాడు. అనంతవర్మ మారువేషంలో ఉన్నప్పటికీ ఆ వచ్చినవాడు తన మేనల్లుడేఅని క్షణంలో తెలుసుకున్నాడు భుజంగవర్మ. తను చేసిన ద్రోహానికి పశ్చాత్తాపపడ్డాడు. 'జరిగిందంతా మరిచిపో. హేమలతను పెళ్లిచేసుకో, రాజ్యంఏలుకో, నేను అడవికిపోయి తపస్సు చేసుకుంటాను' అన్నాడు.

అనంతవర్మ, హేమలతను పెండ్లిచేసు కుని చక్కగా రాజ్యంచేస్తున్నాడు

ఒకరోజున అనంతవర్మ అడవికివెళ్లగా ఒకచోట ఆక్రందనం వినిపించింది. అది యేమిటా అని పోయిచూస్తే ఆ యేడ్చేది అన్నంభొట్లే! ఒక చెట్టుకు కట్టేసివున్నాడు! 'బాబూ!—రాజకుమార్తెను సారంగంలో నించి తీసుకవచ్చింది నేనేననితలిచి దొంగలు రాత్రికి రాత్రి నన్ను నిద్రలోనే లాక్కొనివచ్చారు. ఈ చెట్టుకు కట్టి చిత్ర వధచేయటానికని సిద్ధంగావున్నంతలో మీ అలికిడి విని పారిపోయారు,' అని చెప్పాడు.

అనంతవర్మ అన్నంభొట్లు కట్లు విప్పి రక్షించటమేగాక, సారంగం ఎక్కడున్నదో తెలుసుకుని, దొంగలను పట్టించి, మరి వాళ్లబాధ దేశానికి లేకుండా చేశాడు.






అనగనగనగా ఒక మాంత్రికుడు. వాడు చాలా వృద్ధు. ఆ వూరిలో ఒక సందులో చిన్న దుకాణం పెట్టుకుని వస్తువులమ్ము కొంటూ కాలక్షేపం చేస్తూ ఉండేవాడు. వాడు మాంత్రికుడన్న సంగతి ఒక పిల్ల వాడికితప్ప మరెవరికి తెలియదు.

ఆ పిల్లవాడికి తల్లి లేదు. తండ్రి ఏదో పనిలోకి పోతూవుండేవాడు. అందుకని ఏమీ తోచక, వాడు మాంత్రికుడి దుకాణం కనిపెట్టుకొని ఉండి, వచ్చేవాళ్లకు వస్తువు లన్నీ తీసి చూపించేవాడు.

ఒక్క వస్తువుమట్టుకు తాకవద్దనేవాడు మాంత్రికుడు. అదే ఒక చిత్రమైన తంబుర. దుకాణంమీదికి వచ్చిన ప్రతి వాళ్లూ 'ఆ తంబుర ఎంతకిస్తావు?' అని అడిగేవారు. 'ఇది అమ్మకానికి కాదయ్యా!' అని చెప్పేవాడు మాంత్రికుడు. లక్ష రూపాయలు ఇస్తానన్నాసరే, ఆ తంబుర మాత్రం తాకనిచ్చేవాడు కాదు.

ఒక రోజున ఆ పిల్లవాడు, 'తాతా! తాతా! కోరినంత ధనం వస్తుందికదా! తంబుర అమ్మరాదా?' అని అడిగాడు. "నువ్వు పెరిగి పెద్దవాడవయ్యాక దానిని నీకిచ్చేస్తాను. అది అమరగానం పాడు తుంది. ఆ పాటకు లోకమంతా నిశ్చేష్టులై నీవేపే తిరిగి వింటారు" అని మాంత్రి కుడు తంబుర చేతబట్టి, తీగలు శ్రుతివేసే సరికల్లా దివ్యగానం వినవచ్చింది.

ఐతే, ఇటువంటి గానం ఎలా వినబడు తున్నదీ అని అందరకూ ఆశ్చర్యంకలిగేది. ఈ తంబుర లోపల మాంత్రికుడు ఒక దేవకన్యను బంధించివేశాడు. ఆమెను ఇలా బంధించి ఎంతో కాలమయింది. అప్పటినించీ, మాంత్రికుడికి ఝుడిసి అతడు కావాలన్నప్పుడల్లా ఆమె గానం చేస్తూనే వుంటుంది. ఆ దేవకన్యకు ఈ పిల్లవాడంటే అమిత ప్రేమ. అందుచేత, వాడు తంబుర చేత పట్టినప్పుడల్లా అద్భుత

కె. గంగాబాయి - దాదర్



'చేసుకోవోయ్, మనమడా! దానికి అభ్యంతరం ఏముంది' అన్నాడు తాత.

వెంటనే పిల్లవాడు తంబుర చేతబట్టి బుజానికి అనించుకుని, తీగలు మోగించి శ్రుతి వేశాడు. అప్పుడు తంబురలోంచి "నాయనా!–నా బిడ్డా! నన్నీ బంధము నుండి విడుదల చెయ్యి. నాకు ప్రియమైన అరణ్యాల్లోకి పోనీయి. నా లోకానికి నన్ను చేరుకోనీయి...." అంటూ అతి జాలిగా దీనంగా దేవకన్య పాడింది.

మైన దివ్యగానం పాడి వినిపించేది. దేవకన్య చేసే గానానికి పిల్లవాడు ఆనంద బాష్పాలు రాల్చేవాడు.

ఇలావుండగా బాలుని పుట్టినరోజు పండగ వచ్చింది. ఆ రోజున బాలుడు వచ్చి నమస్కరించగానే వానిని దీవించి, 'మనమడా! నేను నీకిస్తానన్న తంబుర ఇదిగో, దీనిని నీ ఇష్టంవచ్చినట్టు చేసుకో' అని చెప్పి దానిని బహుమతిచేశాడు.

అందుకు పిల్లవాడు అబ్బురపడుతూ, "నాకు అచ్చంగా ఇచ్చేశావా, తాతా? నా ఇష్టం వచ్చినట్టు చేసుకోవచ్చా?" అని మళ్లీ మళ్లీ అడిగాడు.

పిల్లవాడు నగంలో ఆపివేసి, గిరుక్కున మాంత్రికునివేపు తిరిగాడు. "తాతా! ఈ తంబుర నాకు అచ్చంగా ఇచ్చివేశావా? దేవకన్యను బంధంనుండి విడుదల చేయవచ్చా?" అని ఆత్రంతో అడిగాడు.

"తంబురలో దేవకన్య ఉన్నదని ఎలా తెలుసు నీకు?" అన్నాడు ముసలివాడు.

అందుకు బాలుడు "దేవకన్య వాక్కులు నాకు అనేకసార్లు వినిపించినై. ఈ బంధం నుండి విడిపించమని ఇదివరకు ఎన్నోసార్లు ఆమె నన్ను కోరింది. ఇప్పుడు చేస్తున్న గానంలో అతిదీనంగా ఆమె నన్ను వేడుకుంటున్నది. ఆమె బాధ చూచి ఇక ఎంతమాత్రమూ నేను సహించలేను.

ఈ తంబుర అచ్చంగా నాదే ఐతే ఇప్పుడే ఆమెను విడిపించేస్తాను" అని తన హృదయంలోని ఆవేదన వెలిబుచ్చాడు.

"ఆమెను వదిలేస్తివంటే నీవింక దివ్య గానం చెయ్యలేవు. ఆమె దానిలోపల ఉన్నంతసేపే నీవు చేసే గానం దివ్యంగా వుంటుంది. ఆ గానానికి తన్మయత్వం పొంది, లోకమంతా నీ పాదాలదగ్గర వుంటుంది. ఆమెను వదిలేసినప్పటికీ, నువ్వు తంబురమీద పాడవచ్చు. అయితే ఆ పాట బిచ్చగాళ్లు పాడే పాటలాగే వుంటుంది. దివ్యగానంవల్ల కీర్తి, ఐశ్వర్యం, అధికారం అన్నీ వస్తయ్. కాదంటే దారిద్ర్యంలో ఓలలాడుతావు. కనుక, ఏ మార్గంలో కావాలో కోరుకో," అన్నాడు మాంత్రికుడు.

అప్పుడు పిల్లవాడు "తాతా! దేవకన్యని నేను బంధించి వుంచలేను" అంటూ తంబురతీసి, నేలనివేసి కొట్టాడు. తంబుర ముక్క ముక్కలయింది. అందులోనించి ఒక దేవకన్య ఎగిరి, బయటికి వచ్చింది.

"నాయనా! నీవు మంచిహృదయం కలవాడవు. నన్ను బంధంనుండి విడిపించావు. చాలా సంతోషించాను. ఈ తంబురలోపల ఇంక నేనుండను. అందుచేత నా మహిమ




వల్ల ఇంతవరకూ నువ్వు చేస్తూవచ్చిన దివ్యగానం ఇకముందు చెయ్యలేవు. అయితే, నీవద్దకు వచ్చి, దివ్యగానం చేస్తూవుంటాను. అది నువు రాసుకుని గ్రంథస్థంచేసి, లోకానికి అందించు. గొప్ప కీర్తివస్తుంది" అనిచెప్పి అదృశ్యమయింది.

మాంత్రికుడు చిరునవ్వు నవ్వుతూ, పగిలిపోయిన తంబుర ముక్కలను ఏరి దగ్గరగా చేర్చి అతికించివేసి, ఎప్పటిలాగ దానిని పిల్లవానికిచ్చాడు. "మనమడా! నీ త్యాగానికి సాహసానికి మెచ్చాను. ఇదిగో తంబుర తీసుకో. సుఖంగావుండు" అని వానిచేతి కిచ్చి మాయమయ్యాడు.




## 11

పూర్వకాలమందు ఒక గ్రామంలో ఒక సంపన్న గృహస్థు వుండేవాడు. అతిథి సత్కారమంటే ఆయనకు ఎంతో ఆసక్తి. ఒకరోజున వారింటికి మార్గస్థుడైన ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చాడు. ఒక ఉత్తమ బ్రాహ్మణుడు తన యింటికి అతిథిగా వచ్చినందుకు గృహస్థు చాలా సంతోషించాడు. ఆయన్ని ఉచితాసనమందు కూర్చుండబెట్టాడు. గబగబ వంటలు చేయించాడు.

వంట కాగానే ఆ బ్రాహ్మణ్ణి స్నానం చేయమన్నాడు. అతిథీ, గృహస్థూ ఇద్దరూ కలిసి భోజనాలకు కూర్చున్నారు. అతి భక్తితో గృహస్థు ఆయనకు సపర్యలు చేస్తూ, "స్వామీ!—సావకాశంగా భోంచేయండి. మొహమాటపడకండి. ఇది మీ యిల్లు..." అంటూ మర్యాదకోసం, భేదభావంలేకుండా మాటాడజొచ్చాడు.

"స్వామీ!—ఇది మీ యిల్లు" అని అన్నప్పుడల్లా ఆ వచ్చిన అతిథి ఉద్ధరిణెడు నీళ్లుతీసి కుడిచేతిలో వేసికొంటూ—"ఇదం గృహపత్యాజ్ఞానుసారేణ గృహదానం శ్రీ మహావిష్ణు ప్రితికామయ మానస్తుభ్య మహం సంప్రదేన మమనమమ" అని చెప్పి, తనచేతిలో తనే అర్ఘ్యంవిడుస్తూ వచ్చాడు.

మరునాడు అతిథిగావచ్చిన బ్రాహ్మణుడు ఆ యిల్లు మరమ్మతు చేయించటానికి కొంతమంది పనివాళ్లను వెంటబెట్టుకు చక్కావచ్చాడు. ఇదిచూచి గృహయజమాని ఆశ్చర్యపోయాడు. ఇద్దరూ ఘర్షణపడటంచూచి ఊళ్లో పదిమందీ పోగయారు. 'మర్యాదకోసం మాటవరుసకు అన్నది పట్టుకుని ద్రోహంతలపెడతావా? దురాశాపిశాచీ!- సంతోషించాంలే నీ తెలివితేటలకి, నడు నడు' అని చీవాట్లువేసి, అతిథిబ్రాహ్మణ్ణి సాగనంపాడు. నాటినించీ గృహస్థు అలంకారాలు ప్రమాదకరమని తెలుసుకొని, మానివేసి, జాగ్రత్తగా మాటాడేవాడు.

అనగనగా ఒక ఊరిలో పరమలోభి అయిన ఒక నేతివర్తకుడు వుండేవాడు. అతడు నేతిలో బాగా కల్తీచేసి అమ్ముతూ వచ్చాడు. అయితే దొంగతనం, మోసం ఎన్నాళ్లని దాగుతుంది? కొన్నాళ్లకు వర్తకుడు పట్టుబడ్డాడు. వానిపయిన కేసు పెట్టారు. విచారణ జరిగింది.

న్యాయాధిపతి తీర్పుచెబుతూ, శెట్టితో ఈవిధంగా చెప్పాడు—

"నీవుచేసిన ఈ నేరానికిగాను, ఒక వీశె కంపునెయ్యి తాగినాసరే, లేదా నూరుకొరడా దెబ్బలుతిన్నాసరే, అదీ యిదీ కాదంటే ఒక నూరురూపాయిలు జరిమానాచెల్లించినా సరే! ఈ మూడింటిలో నీకు ఏ శిక్ష యిష్టమైతే దానినే విధిస్తాను. కోరుకో."

బాగానే వుందనుకున్నాడు సావుకారు. 'కొరడా దెబ్బలు ఎవరు తింటారు? చూస్తూచూస్తూ ఒకటికాదు రెండుకాదు వందరూపాయలు జరిమానా మాత్రం ఎలా యిచ్చుకోగలను? కనుక ఎట్లాగో కళ్లుమూసుకుని ఒక వీశె కంపునెయ్యి తాగేస్తే పీడ వదిలిపోతుంది' అని అనుకొని మొదటి షరతుకి వప్పుకొన్నాడు. న్యాయాధిపతి వెంటనే ఒక వీశెడు కంపునెయ్యి తెప్పించాడు.

వర్తకుడు సిద్ధపడ్డాడేకాని, తీరా నెయ్యి తెచ్చి యివ్వగా, ఒక్క గిద్దెడు తాగేసరికి మొహంమొత్తి వాంతిచేసుకున్నాడు. అప్పుడతను కొరడాదెబ్బలు తినటానికే వప్పుకొనగా తలారులు కొట్టనారంభించారు. ఆరు దెబ్బలు తినేసరికి తట్టుకోలేక, 'బాబోయ్, దెబ్బలువద్దు, జరిమానాయే ఇచ్చుకొంటా'నంటూ నూరు రూపాయిలూ జరిమానా చెల్లించి బ్రతుకుజీవుడా అంటూ బయటపడ్డాడు.

ఈవిధంగా లోభత్వంవల్ల సాహుకారు ఒక్క శిక్షతోపోయేదానికి బదులు మూడు రకాల శిక్షలూ అనుభవించవలసి వచ్చింది! అందుకనే 'లోభి అన్నివిధాలా చెడుతాడు' అంటారు.

11-వ కథ పంపినవారు జె. సుగుణమణి, కార్వేటినగరం.
బహుమతిగా ఈమెకు ఒక చిత్రమైన బొమ్మల ఆల్బమ్ ఇవ్వడమైనది.
12-వ కథను కె. మృత్యుంజయరావు, బెంగళూరునించి పంపాడు.
ఇతనికి అచ్చులు కూర్చుకొనే తబ్బరుబైపుల పెట్టెను పంపుతున్నాము.




# పుష్పగంధి

పుండరీకపట్టణాన్ని సంపాతి అనేరాజు పరిపాలించేవాడు. అతనిరాణి చంద్రరేఖ. ఎన్నాళ్లకూ వారికి సంతతి లేకపోగా, రాజు అరణ్యాలకుపోయి ఘోర తపస్సు చేశాడు. కొంతకాలానికి ఈశ్వరుడు ప్రత్యక్షమై, 'నీ కోరిక నెరవేరుతుంది. వెళ్లవోయి రాజా!' అని చెప్పి అంతర్హితు డయ్యాడు.

ఆ ప్రకారం వారికి వరప్రసాదంగా ఒక చక్కని చుక్కవంటి కూతురు పుట్టింది. ఆమెకు పుష్పగంధి అని పేరు పెట్టారు. దైవజ్ఞులు వచ్చి అమ్మాయి జాతకం చూచారు. 'అన్ని విషయాలలోనూ చాలా దివ్యంగా వున్నది. కాని ఒక్కటే లోపం' అన్నారు. 'అదేమిటి?' అని రాజు ఆత్రంతో ప్రశ్నించగా, 'పెళ్లిఅయిన తొమ్మిదోనాడు ఈమెకు భర్తగండం కలుగవచ్చు' అన్నారు. ఈ మాట విన్నప్పటినించీ రాజూ రాణీ దిగులుపెట్టుకొన్నారు.

పుష్పగంధికి యుక్తవయస్సు వచ్చింది. కూతురు పెళ్ళినిగురించి రాణి పదేపదే భర్తతో ప్రస్తావింపసాగింది. అందుకు సంపాతి 'రాణీ!—పెళ్లి అయిన తొమ్మిదో రోజున మన పుష్పగంధికి అయిదవతనం తొలగిపోతుందని చెప్పారు జ్యోతిష్కులు. పెళ్లి చేయకుండానే వుంటే ఆ గండం దానంతటదే తప్పిపోతుంది కదా! కనుక, పెళ్ళిమాట తలపెట్టనేవద్దు' అన్నాడు.

ఒకరోజున పుష్పగంధి చెలికత్తెలతో సహా బయల్దేరి, వేడుకగా ఒక అరణ్యం చూడబోయింది. ఆ అరణ్యంలో ఒక కొలను కనబడేసరికి, రాజకుమార్తే, చెలికత్తెలూ అందులో సరదాగా జలకమాడటం ప్రారంభించారు. అంతలోనే డేగ ఒకటి వచ్చి కొలను గట్టుమీద వాలింది. అది దగ్గరదగ్గరగా రావటంచూచి, రాజపుత్రి దానిని పట్టుకోబోయింది.

ఆర్. జయవేలు - పాండిచేరి



ఆమె పిట్టను పట్టుకోబోతూవుండగా, ఆ డేగను వదిలిన రాజకుమారుడు రత్నమండనుడు అక్కడికి వచ్చాడు. డేగను వెదుకవచ్చిన అతడు ఆమె సౌందర్యాతిశయాలకు పరవశుడైపోయాడు.

డేగకోసం వెళ్లిన రత్నమండనుడు ఎంతకూ రాకపోగా, అక్కడ కనిపెట్టుకుని వున్న అతని నేస్తుడు ఇంద్రదత్తు వెతుక్కుంటూ వచ్చాడు. పరిస్థితి చూచాడు. రత్నమండనుడు మనసువిడిచి, 'నేస్తం! నేను ఆ పుష్పగంధిని పెళ్లాడితీరాలి. లేకుంటే జీవించి లాభంలేదు' అన్నాడు. సరే, ఆ అమ్మాయి సంగతి కనుక్కువద్దామని అతడు బయల్దేరాడు. కొంతదూరంలో ఒక రాకుమార్తెకు చెలికత్తెలు నీళ్లుచల్లి సేదతీరుస్తూ వుండటం కనబడింది.

'ఆ అమ్మాయి ఎందుకు మూర్ఛపోయిం?'దని ఇంద్రదత్తు అడిగేసరికి, వారు "ఏం చెప్పమంటావు నాయనా? ఆ అడవిలో కొలనుగట్టున ఒక రాజకుమారుణ్ణి చూచింది. 'అతడే నా భర్త' అని పట్టుపట్టి కూర్చుంది" అని చెప్పారు.

అందుకు ఇంద్రదత్తు 'భేష్, బాగానే వుంది. ఈ రాజకుమార్తె కోసమని అక్కడ మా రాజకుమారుడు సోలిపోయివున్నాడు. అతని కోసమని మీ రాజకొమార్తె మూర్ఛపోయింది. సరే, ఇంతకంటె కావాలిసిందేమిటి!' అంటూ మరలిపోయాడు. ఇంద్రదత్తు నేస్తునికూడా తీసుకుని తమ దేశం చేరుకున్నాడు. రత్నమండనుడి తండ్రి అయిన నందమహారాజుకు సంగతి సందర్భాలన్నీ వినికిడిచేసి, సంబంధం నిశ్చయించమని ప్రోత్సహించాడు.

నందమహారాజు సంపాతికి కబురు పెట్టాడు. సంపాతి దాపరికం లేకుండా తన కూతురుకు సంభవింపబోయే గండాన్ని గురించి ఉన్నది ఉన్నట్టు వెల్లడించాడు.



నందమహారాజు కొడుకుతో ఈసంగతి చెప్పి ఈపెళ్లి మానిపించుదామని యత్నించాడు. కాని, వద్దన్నకొద్దీ రత్నమండనుడు భీష్మింపసాగాడు. చేసేదిలేక నందమహారాజు అంగీకరించాడు. అతి వైభవంగా వివాహం జరిగింది.

రత్నమండనుడు పుష్పగంధిని వెంట బెట్టుకుని రత్నపురికి వెళ్ళాడు. పెళ్ళైన తరువాత ఎనిమిదిరోజులు ఇట్టె గడిచినై. తొమ్మిదవనాడు రాత్రి షికారుపోయి వస్తున్నాడు రత్నమండనుడు. ఆ చీకటిలో అతడు ఇంటికి మరలిపోతూవుండగా ఎవరో ఆతనిని పేరుపెట్టి పిలిచినట్టయింది.

ఆ కేక వచ్చిన చెట్టువేపు గిరుక్కున తిరిగి చూచేసరికి, ఒక భయంకరమైన విగ్రహం అగుపించింది—పొడవు కోరలు, కోర మీసాలు, బానకడుపూ—ఇలాంటి లక్షణాలు గల బ్రహ్మరాక్షసుడు వాడు!

'ఆకలి వేస్తూంది, రారా మింగేస్తా!'—నంటూ గర్జించాడు ఆ రాక్షసుడు. అప్పుడు జ్ఞాపకం వచ్చింది రత్నమండనుడికి—పుష్పగంధి జాతకంలో భర్తగండం ఉన్న సంగతి. 'ఓహో, ఇదేకామాలు జ్యోతిష్కులు చెప్పిన గండం. ఏమో అనుకుని ఉపేక్షచేశాను గాని వారి వాక్కు వృథా కాలేదే! కానీ, ఏంచేస్తాం' అనుకొన్నాడు.

ధైర్యంతో రాక్షసుని ఎదుటికి వెళ్ళి, "అయ్యా, ఇదుగో వచ్చాను. నన్ను మింగివేసి నీవు ఆకలి తీర్చుకోవచ్చు. పుట్టిన ప్రతి జీవుడూ గిట్టవలసిందే. రోగాలతో రొచ్చులతో చచ్చేకంటే నీవంటి రాక్షస ప్రభువుకి ఎరకావటంలోనే పుణ్యమూ పురుషార్థమూ ఉన్నది. ఐతే—ఒక మనవి: నీవు నన్ను అకస్మికంగా పట్టేశావు. ఈ మట్టున కబళించివేస్తివంటే, నన్నుకన్న తలిదండ్రులకూ, కట్టుకున్న భార్యకూ ద్రోహంచేసిన వాడి నవుతాను. కనుక,

ఒక్కగంటసేపు నన్ను వదులు. నావాళ్లతో చెప్పేసి వస్తా. ఇదే నా తుది కోరిక" అన్నాడు రత్నమండనుడు.

సహజంగా పాషాణుడే ఐనప్పటికీ, ఆ రాక్షసుడి హృదయం కరిగిపోయింది. ఏమీ అంటే రత్నమండనుడు చెప్పిన మాటలు ఎంతో సబబుగా ఉన్నై. ఐనా, ఆటంకం కల్పించుదామని రాక్షసుడు ఒకమాట అన్నాడు: 'అబ్బాయీ!—ఏదో చాలా నిజాయితీగా మాటలు చెబుతున్నావు. బాగానే వుంది. కాని, ఇంటికి వెళితే మరలిరావటం నీవశం కాదుసుమా. ఇలా చాలామంది చెప్పి తప్పించుకు పోతూవుంటారు. మాట నిలుపుకొన్నవాళ్లు తక్కువ' అని హెచ్చరించాడు.

అందుకు రత్నమండనుడు 'అయ్యా! నీకు సందేహ మెందుకు? ఒకవేళ నేను ఈతూరి తప్పించుకున్నానే అనుకో. మళ్లీ నీ కంటబడకుండా ఎక్కడికి పోగలను? మోసంచేసి నెగ్గగలనా?' అని ఎదురుప్రశ్న వేశాడు. రాక్షసుడు పకపకా నవ్వి 'సరే, నువ్వు పోయిరారా. కాని, ఒక ఒట్టువేసుకోవాలి: 'భిక్షకు వచ్చిన అతిథిని తిరస్కరించినవాళ్లు ఏపాపం పొందుతారో, మాట




తప్పిపోయిన పక్షమందు అటువంటి పాతకమే నన్ను చుట్టుకొనునుగాక!' అని.

అలానే ఒట్టు వేసుకుని రత్నమండనుడు బయల్దేరాడు. ఇల్లు చేరుకొన్నాడు. సంగతి సందర్భాలు తలిదండ్రులతో చెప్పాడు. వారూ, బంధుమిత్రులందరూ గగ్గోలుపెడుతూ, అతనిని వెళ్ళవద్దని పట్టుపట్టారు. 'మాట తప్పలే' నన్నాడు రత్నమండనుడు.

చివరకు పుష్పగంధివద్దకు వచ్చి, తన సమాచారం చెప్పాడు. బుద్ధిశాలిని అయిన పుష్పగంధి వివరాలన్నీ తెలుసుకున్నది. తక్కిన అందరిలాగా భర్తను నిరుత్సాహ

పరచలేదు. అతి ధైర్యంతోనూ, సంతోషం తోనూ భర్తతో "మీరు మాటతప్పని మాన ధనులు. పోయిరండి. జయమవుతుంది!" అన్నది. ఈ మాటలకు అందరూ ఆశ్చర్య పోయారు.

పుష్పగంధి మాటలకు రత్నమండనుడు ఆనందపరవశు డయిపోయాడు. ఈ జీవి తంలో తనేదో ఒక గొప్ప కార్యం నెరవేరు స్తున్నట్టు తృప్తిపడ్డాడు. చెప్పిన గడువుకి సరీగా రాక్షసుడి ఎదుట ప్రత్యక్షమైనాడు.

'స్వామీ!—వచ్చాను. ఆకలితీర్చుకో' అన్నాడు రత్నమండనుడు. చెట్టుమీది నుంచి రాక్షసుడు దిగివచ్చి రత్నమండ నుణ్ణి పట్టుకొన్నాడు. అంతలోనే 'భిక్షాం దేహి!' అన్న మాటలు వినబడినై!! తిరిగి చూచాడు. ఆ భిక్ష కోరినదెవరు?—రత్న మండనుడి భార్య పుష్పగంధి!!!—

అంత ఆకలితో ఉన్నప్పటికీ, రాక్షసుడు 'అమ్మా, ఏమి భిక్ష కావాలి నీకు?' అని అడిగాడు. 'ప-తి-భి-క్ష' అన్నది ఆమె ఎంతో వినయంగా. రాక్షసుడు అదృశ్య మైపోయి, ఆ చోటున ఒక దివ్యసుందరు డైన గంధర్వుడు కనిపించాడు.

అతడు రత్నమండనుడితో "ఓయీ!—రాజపుత్రుడా!—నీ భార్యకు భర్తగండం తప్పింది. మీ కష్టాలు గట్టెక్కినై. ఆమె నీకు తగినభార్య. కుశాగ్రబుద్ధి. నీవు చెప్పిన మాటలవల్లనే అతిథి పూజలో నాకు దీక్ష కలదని ఆమె గ్రహించింది. నీచేత నేను వేయించిన ఒట్టు నాకే వర్తించేటట్టు చేసి, పతిభిక్ష పొందింది. నేను పాపంచేసిన ఒక గంధర్వుడను. శాపవశాన ఈ రాక్షస జన్మ ఎత్తవలసి వచ్చింది. నీ భార్యకు పతిభిక్ష పెట్టగానే నాకు శాపవిముక్తి ఐపో యింది' అనేటంతలో పైనుండి విమానం వచ్చి గంధర్వుణ్ణి తీసుకపోయింది.

నూతన దంపతులు ఇల్లుచేరుకొని ఆనందంగాఉంటున్నారు.



# చందమామ పజిల్
## (భాషాభివృద్ధికి)

### అడ్డము:

1. ఉపకారము
3. వైరము
4. గులాబి
6. ఏనుగ
8. బృహస్పతి
11. జడ
12. సంపద
13. ధాన్యం నిలవ చేసే గొయ్యి
15. కోతి
16. మనస్సు
18. రాయి
19. ధనువు



### నిలువు:

2. తిరగబడిన రోలు
3. భర్త
5. అరణ్యము
6. గుంపు
7. ఒక నది
9. వ్యాధి
10. చుట్టుకొలత
13. పాపాత్ముడు
14. లక్ష్మి
15. స్వప్నము
17. స్వర్గము

# వినోద చదరం



దిగువను ఇచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరంలో మీరు ఏడు మాటలు నింపాలి. సరియైన మాటలతో మీరు నింపగలిగితే అన్ని మాటలలోను చివరి రెండు అక్షరాలూ ఒకేలాంటివి వస్తయ్. దీనిని పూర్తి చేయగలరేమో చూడండి.

మీకు తెలియకపోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.

| | | | |
|---|---|---|---|
| 1. | | | |
| 2. | | | |
| 3. | | | |
| 4. | | | |
| 5. | | | |
| 6. | | | |
| 7. | | | |

### ఆధారములు:

1. సంపద
2. ధైర్యము
3. వాత్సల్యము
4. స్నేహము
5. బలాత్కారము
6. మంచిబంగారం
7. హోమము






## ఖాళీపెట్టెలో పిల్లను తెప్పించటం

ఈ ఇంద్రజాలం చాలా విచిత్రంగా ఆశ్చర్యకరంగా వుంటుంది. ఇంద్రజాలికుడు ఒక పెద్ద పెట్టెను ప్రేక్షకుల యెదుటికి తీసుకొచ్చి, దాన్ని ఓరగిలా పెట్టి, మూతతీసి చూపిస్తాడు. అందులో ఏమీ వుండదు. ప్రేక్షకులు కూడా 'అడుగుచెక్క వరకూ స్పష్టంగా కన్పిస్తోనేవుంది. ఏమీలేదు. ఒఠ్ఠి ఖాళీపెట్టే' అని నమ్ముతారు. మళ్ళీ పెట్టె సరీగ్గా పెట్టేసి, మూతవేసి మళ్లీతియ్యగానే ఆ పెట్టెలో ఒక పిల్ల కూర్చుని వుంటుంది.

ఈ ఇంద్రజాలం కేవలం మనదేశీయుల సొత్తు. ఇది చాలా కాలంనుంచి మనదేశంలో ప్రచారంలో వుంది. వీధుల్లో ప్రదర్శనాలిచ్చే గారడీవాళ్లు—కొయ్యపెట్టెకు బదులు వెదురుబుట్టను ఉపయోగించి ఈ ఇంద్రజాలాన్ని ఎంతో నేర్పుగా ప్రదర్శిస్తూ వుంటారు. కాని విదేశీయులు రంగస్థలాన్ని రంగురంగుల దీపాలతో అలంకరించి, అందమైన పెట్టె తయారుచేయించి—ప్రేక్షకులు తెల్లబోయి చూసేటంత ఆశ్చర్యకరంగా ప్రదర్శిస్తున్నారు. ట్రిక్కు చేసినప్పుడు ఎలావుంటుందో ప్రక్క పేజీలోని మొదటి చిత్రంలో చూడవచ్చు. ఇందులోని కీలకం ఎంత ప్రయత్నించినా ప్రేక్షకులు కనుక్కోలేరు.

ఐతే - దాని క్రిందనున్న రెండోచిత్రం చూస్తే చేయటానికి ఇది ఎంత సులభమో తెలిసిపోతుంది.

మొట్టమొదట పెట్టె తెరిచి చూసినప్పుడు పెట్టె ఖాళీగా కనుపించినా దాని వెనుకనున్న ఒక చెక్కపైన పిల్ల పడుకొనే వుంటుంది. ఎలాగంటే—ప్రేక్షకుడికి కనుపించే పెట్టె అడుగుచెక్క కాకుండా

పెట్టె వెనుక వైపుకూడా, అదే కొలతగల మరొకచెక్క (2 3,4,5) వుంటుంది. ఇది పెట్టె అడుగుచెక్కతో చేర్చబడి, పైకీ క్రిందికీ, వాల్చటానికి వీలుగా వుంటుంది. అదేప్రకారం పెట్టె వెనుకవైపు కనుపించే చెక్క (1,2,5,6) కూడా పైకీ, క్రిందికీ వాల్చటానికి వీలుగా వుంటుంది.



ప్రేక్షకులు పెట్టె ఖాళీదేనని చూచుకొన్నతర్వాత ఇంద్రజాలికుడు తాను తెరిచిన మూతను తిరిగి దించివేసి, 1, 2, 5, 6 గుర్తులుగల చెక్క అడుగు భాగంగా వచ్చేట్టు వెనుకకు వంచుతాడు. అప్పుడు ఆచెక్క పైకిలేచి, దానిస్థానే 2, 3 4, 5 గుర్తులు గల చెక్క వుండిపోతుంది. అంటే ఆ చెక్కపైన పడుకొనివున్న పిల్లకూడా చెక్కతోపాటు పెట్టెలోకి వచ్చేస్తుందన్నమాట. ఇప్పుడు మూత తీయగానే లోపలవున్న పిల్ల లేచి బయటికి వస్తుంది.




ఒక ముఖ్యవిషయం: పెట్టెలో వుంచబడినపిల్ల అటూయిటూ ఏమాత్రం కదలకూడదు. మొదట ఆ పెట్టెలో పడుకో పెట్టినప్పుడు కదలకుండా ఎలా పడుకుంటుందో-ఫీట్ అయేటంతవరకూ అలాగే ఏమాత్రం మెసలకూడదు. పెట్టెను పైకియెత్తటం - ఓరగిల పెట్టటం, మొదలయిన పనులన్నీ ఇంద్రజాలికుడూ అతని అనుచరులూ వాళ్లలోవాళ్లే చేసుకుపోతారు. తర్వాత పెట్టెను మళ్లీ సరీగ్గా నిలబెట్టి - వన్ - టు - త్రీ - అని మూతతీసేసరికి మొదటి చిత్రంలో చూపినట్లు - పిల్ల బైటికి రావటం చూసి ప్రేక్షకులు తెల్లబోతారు.

పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలునుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరురాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ముఖ్యం.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది : —

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్,
12/3/A, అమీర్‌లేన్, బాలీగంజ్,
కలకత్తా - 19.

## రంగు వెయ్యండి—6-వ బొమ్మ కథ

రాకుమారుడు ఇల్లు చేరుకోగానే చిలుకకు ధూపంవేయటానికి ఏర్పాట్లు జరిగినట్లు చెప్పాము. ఆప్రకారం ధూపంవేశారు. ఆ ధూపం తగిలినవెంటనే రామచిలుక మళ్లా రాకొమార్తెగా మారిపోయింది. ఇదిచూచి అందరూ ఆశ్చర్య పడటమేకాదు, ఆనందపరవశులయ్యారు. వాగ్దానంప్రకారం రాకుమారునికీ ఆమెకూ వైభవంగా పెళ్లిజరిగింది. కొద్దికాలానికే ఆ దంపతులకు చందమామ వంటి ఒక అందాలబిడ్డ పుట్టాడు. ఆ బిడ్డను చూచుకొని ఆ దంపతులే కాదు, రాజూ రాణీమాత్రమేకాదు, రాజ్యంలోని ప్రజలంతా సంతోషభరితులైనారు.

ఇలవైఒక్కొరోజున బిడ్డను బంగారుతొట్టిలో పెట్టి వూపిస్తున్నది రాకుమార్తె. చెలికత్తెలు పక్కనేవున్నారు. ఎక్కడినించి వచ్చిందో, ఒక పంచెవన్నెల రామ చిలుక అంతఃపురంలోకి వచ్చి వాలింది. దానినిచూచి రాకుమార్తె ఎంతో ముచ్చటపడింది. కాని, అంతలోనే ఆ చిలుక మానవభాషలో 'బిడ్డనిస్తావా? భర్తనిస్తావా?' అంటూ అడుగనారంభించింది. ఈమాట ఏమిటో అర్థంగాక రాకుమార్తె, చెలికత్తెలూకూడ నివ్వెరపోయారు.

రాకొమార్తె వెంటనే భర్తకు కబురంపగా, అతడువచ్చి 'అవును, బిడ్డపుట్టిన సందడిలో ఆమాటే మరిచాను,' అంటూ, తను కొండమీది మహానుభావునికి చేసిన వాగ్దానంగురించి సాంతంగా చెప్పాడు.

అప్పుడు రాకుమార్తె ఆ చిలుకకు నమస్కరించి, 'స్వామీ!—నన్ను కాపాడటం కోసమని ఎన్నెన్నో కష్టాలుపడి మీదర్శనంచేసికొని మీకు వాగ్దానంచేసివచ్చాడు నా భర్త. భర్తను వదులుకొని భార్య ఈలోకంలో చేయవలిసిందేమీలేదు, కనుక ఆయన లేనిది నేను జీవించలేను. పోతే—మీ నోటివాక్యాన వరప్రసాదంగా పుట్టిన మా కళ్లవెలుగు ఈ బిడ్డడు. ఇచ్చిన బిడ్డను మరల తీసికొంటాననడం మహాత్ములకు తగునా? మన్నించండి. నేను భర్తనూ వదులుకోలేను, బిడ్డనూ వదులుకోలేను. తప్పదంటే నన్ను మళ్లీ చిలుకగా మార్చివేయండి. మార్చివేసి నా భర్తనూ బిడ్డనూ తీసుకపోండి, అప్పుడు ఏ విచారమూ ఉండదు' అంటూ హృదయంలోని ఆవేదనను వెలిబుచ్చింది.

అప్పుడా చిలుక కొండమీది మహానుభావునిగా మారిపోయింది. ఆయన రాకుమార్తె త్యాగాన్ని మెచ్చుకొని మనసార దీవించి అంతర్హితుడయ్యాడు. ఇది ఈ నెల రంగువెయ్యండి బొమ్మకథ—ఇంతటితో సమాప్తం.

# సినీమా సరదా

"మహేశ్వర్" (మద్రాసు)



సినిమా చూదాం సినిమా చూదాం
అనుకుంటున్నాం అందరమూ!

అమ్మా నాన్నా సంబరపడినా
మేమందరమూ తొందరపడినా
తొలివారంలో బుకింగు బందూ!
మలివారంలో కరెంటు బందూ!
మూడవవారం సరదా లేదూ
నాల్గోవారం డబ్బుల్లేవు

అటంకాలూ రాకుంటేనూ
తీరావెళ్లే రోజొకటొస్తే
"ఐతె గియ్‌తె అరావులపాడి!"
ఠండా ఠండా షర్‌బత్ సోడా
గరమాగరమ్ చీనాబాదం
అన్నీ కొనమని అల్లరి వద్దని
అమ్మా పెట్టే షరతులు అన్నీ
ఒప్పేసుకుంటాం! టాం-టాం!

ఎనిమిది గంటలకల్లా తెమిలి
హాలుదగ్గరకి వెళ్లేసరికీ
గుంపుల గుంపుల జనసమ్మర్దం
గేటులదగ్గర తోపులాటలో
కుయ్యోఁ మొర్రో అంటూ వెళ్లి
లోపల జాగా వెతిగీ విసిగీ
గాలీ తగలని పంకా కిందా
నల్లుల బెంచీలైతే మంచిది
నిద్దుర రాదని వేసేరేమో
అనిపించే ఆ బెంచిలమీద
కునికిపాట్లు పడుతూ లేస్తూ
హా...హా...హాయ్ యని అవలిస్తూ
సినిమా చూచేం సినిమా చూచేం!

మధ్యని పాపాయ్ లేచేడుస్తే
ఊరడించమని కేకలు వస్తే
'పాడుపిల్లలను వెంటవేసుకొని,
సినిమా చూడ్డం బుద్ధి తక్కు'వని
అమ్మ విసుగుతో అవతలికెళ్తే

అయ్యయ్యో డబ్బులు దండగ
ఐనాయే అని నాన్నకి బెంగ!
డబ్బులు పోయీ నిద్దుర పోయీ,
సరదాలేదూ సరేకదా
ఉదయం నిద్దుర లేచేసరికీ
పొద్దెక్కిందని ఒకటే గోల
సినిమా ఒద్దు, ఒద్దంటే ఒద్దే ఒద్దు!

# అట్టమీది బొమ్మ

ధర్మరాజు 'రాజసూయయాగం తలపెట్టాడు. అందుకోసం భీమార్జునులు సంచారం బయల్దేరారు. భీమార్జునులతోకూడా శ్రీకృష్ణుడు మగధరాజధానికి బయల్దేరి వెళ్లి. జరాసంధునితో 'రాజేంద్రా!—మేము దూరదేశమునుండి వచ్చిన అతిథులము. నీవు అతిథిపూజాధురంధరుడవని విన్నాము, మేము కోరినది ఇచ్చి నీ బిరుదు సార్థకంచేసుకోవలిసింది' అన్నాడు.

'కోరుకోండయ్యా, మీకుకావలసినది. సంశయించకండి' అని జరాసంధుడు అనగానే వాసుదేవుడు మగధపతితో 'ఇతడు అర్జునుడు. అతడు భీమసేనుడు. ఇద్దరిలో ఎవరితోనైనాసరే యుద్ధంచేసి జయించాలి. ఇదే మా కోరిక' అన్నాడు. అందుకు జరాసంధుడు 'నీవు మధురనుంచి పారిపోయి సముద్రంలో దాక్కొన్న పిరికిపందవు. అర్జునుడు నాకంటె పిన్నవాడు, బలంలో నాకు తక్కువవాడున్ను. కనుక, సమానబలుడైన భీమునితోనే యుద్ధంచేస్తా' నన్నాడు.

ఇలా అంటూ జరాసంధుడు ఒక గద భీమునికి ఇచ్చాడు, రెండవది తను తీసుకున్నాడు. నగరు వెలపల రణరంగమందు ఇద్దరూ తలపడ్డారు. ఆ గడలు తిప్పుతూవుంటే చూచేవాళ్లకు కన్నులు గిరగిర తిరుగసాగినై. వారు డీకొంటూ వుంటే పిడుగులు పడ్డట్టు, బ్రహ్మాండమైన ఏనుగులు తొక్కినట్టూ చటచటా శబ్దాలు ఎగసినై.

కొంతసేపు గదాయుద్ధం అయినతరువాత ఆ మహావీరులు ముష్టిప్రహారాలు ప్రారంభించారు. ఒకళ్లనొకళ్లు పిడికిటిపోట్లు పొడుచుకొనటం చూడగా అతి భయంకరంగా తోచింది. ఒకరికొకరు తీసిపోకుండా పోరుసల్పటం చూచి, జరాసంధుని పుట్టుపూర్వోత్తరాలు తెలిసిన శ్రీకృష్ణుడు ఒక పుల్లతీసి, దానిని నిలువునా రెండు చీలికలుచేసి చూపుతూ భీమునికి సంజ్ఞచేశాడు.

ఈసంజ్ఞను భీమసేనుడు అందుకొని వెంటనే శత్రువును నేలకు పడగొట్టి వాని కాలు తనకాలితో తొక్కి, కాళ్లకు కాళ్లు చేతులకు చేతులు దేనికదిచీల్చి వేశాడు. దుష్టుడైన జరాసంధుడు ఇలా హతుడు కావటంతో జనులు హాహాకారాలొనరించారు, కృష్ణార్జునులు భీమసేనుని కౌగిలించుకొని, అనేకవిధాల మెచ్చుకొన్నారు.

49-వ పేజీలోని

పజిలుకి జవాబు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 మే | 2 లు | | | | 3 ప | గ |
| | 4 రో | 5 జా | | 6 దం | తి | |
| 7 కా | | 8 గు | 9 రు | డు | | 10 ప |
| 11 వే | ట | | గ్మ | | 12 సి | రి |
| రి | | 13 పా | త | 14 ర | | ధి |
| | 15 క | పి | | 16 మ | 17 ది | |
| 18 శి | ల | | | | 19 వి | ల్లి |

49-వ పేజీలోని

వినోద చదరానికి జవాబు :

| | | | |
|---|---|---|---|
| 1 | క | లి | మి |
| 2 | తా | లి | మి |
| 3 | మా | లి | మి |
| 4 | చె | లి | మి |
| 5 | బ | లి | మి |
| 6 | మే | లి | మి |
| 7 | వే | లి | మి |

## ఒంటిగీత బొమ్మలు



పంపినవారు :

టి. వి. రంగస్వామి, ఆరణి



పంపినవారు :

కె. బి. కుల్కర్ణి, బాగల్‌కోట

వస్తూంది!




# పెళ్లి చేసి చూడు

నిర్వహణ...

**నాగిరెడ్డి...చక్రపాణి**

డైరెక్షన్

**ప్రసాద్**


Controlling Editor : SRI CHAKRAPANI

Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras - 1

